

కాళీయమర్దనుడు

'తా ర క'

# ఈ సంచికలో



## యువతీలోకం



ముఖచిత్రం: 'రాధా మాధవులు'

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య




ఆంధ్ర ప్రజల భావాలను ప్రతిబింబించేట్లు వ్రాసే పత్రికలలో మీ పత్రిక అగ్రస్థాయిని అందుకోవడానికి ఒక్కొక్క మెట్టుగా పైకి పోతూ వుందంటే అతిశయము కాదు. పారిశ్రామికంగా, ఆర్థికంగా మనరాష్ట్రం ఎంతో వెనుక పడివుందని తెలుసుకోడానికి ఒకసారి మద్రాసు రాష్ట్రాన్ని చూస్తే చాలు. ఈ రంగాలలో తమిళుల అభివృద్ధికి కారణం వారే. తమరాష్ట్రాన్ని భారతదేశంలోని రాష్ట్రాలలో తల మానికం చెయ్యాలన్న అభిలాష రాష్ట్ర ప్రభుత్వానికే గాక ప్రతి పక్షాలన్నిటికీ వుంది. అవసరమైతే కేంద్రానికి ఎదురీదగల్గిన నాయకులు వారికి వున్నారు.

మనరాష్ట్ర అభ్యుదయాన్ని ఏకైక లక్ష్యంగా వుంచుకొని రాష్ట్రప్రజలకై పాటుపడే నాయకులు మనకు పూర్తిగా కరువు ఔతున్నారు. మనకు కేంద్రంలో పూర్తిగా పలుకుబడి లేకపోవచ్చు కానీ ఆంధ్రులందరూ కలసికట్టుగా పనిచేసి ఆందోళన జరిపితే రాష్ట్రానికి ఇప్పుడు జరుగుతున్నంత అన్యాయం జరగదు. ఉదాసీనత చూపరు. మద్రాసు, బళ్ళారి, తిరుత్తని నేర్పిన గుణపాఠాన్ని మనం అప్పుడే మరిచిపోతే నదీజలాల తగాయిదా కూడా అదే జాబితాలో చేరవచ్చు.

మురళీమోహన్ రావు
మద్రాసు

---

## రచయితలకు విజ్ఞప్తి

1962 వ సంవత్సరం నవంబరు నెల 'యువ' ను దీపావళి ప్రత్యేక సంచికగా ప్రచురిస్తున్నామని తెలియజేయుటకు సంతసిస్తున్నాం. రచనలు, కార్టూనులు మా కార్యాలయానికి ఆగష్టు 20 వ తేదీలోగా చేరాలి. ప్రచురణకు అంగీకరించబడని రచనలను తిప్పి పంపగోరువారు తమ రచనలతో అవసరమైన పోస్టేజి జతపరచవలెను. రచనలు 10 – 15 వ్రాతప్రతులకు మించరాదు. కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయాలి.



"ఏవిటీ!
ఇంట్లో
**అమృతాంజనం**
లేదా?

నా కండరాల నొప్పి తగ్గటానికి
ఏం చేయాలి?"

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎప్పుడూ అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం. అమృతాంజనం యింట్లో వుందంటే మీరు నిశ్చింతగా వుండవచ్చు.

అమృతాంజన్ లిమిటెడ్
14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.




JWT-AM 1882

ఆర్యా,

"యువ" జూలై సంచికలో ప్రచురింపబడిన రాచకొండ విశ్వనాధశాస్త్రి గారి 'అగ్గిపుల్ల' కథ — ఒక్కముక్కలో చెప్పాలంటే-అద్భుతంగా వుంది.

అదే సంచికలోని అస్థిపంజరం కథచక్కగా వుంది. ఇద్దరు రచయితలకూ హృదయ పూర్వకాభి వందనలు:

*నాయని సత్యనారాయణరావు.*

పాలకొల్లు.

జూలై సంచికలో 'పవితేనిమంగలి' వ్రాసినట్లుగా, ఆంధ్రులు, విశాల ధృక్పధము గలవారై నప్పటికీ, పదవీ వ్యామోహులు కాబట్టి, ఉమ్మడి మద్రాసురాష్ట్రం వున్నపుడు, తమ రాష్ట్రానికి యేమీ సమకూర్చుకోలేక పోయారు.

*రంగారావు*

భిలాయి.

యువ జూలై సంచికలో వడ్డాది పాపయ్య గారి "రతీమదన" "రోహిణీచంద్ర" చిత్రాలు చాలా ఆకర్షణీయంగా వున్నవి. రాచకొండ విశ్వనాధశాస్త్రి వ్రాసిన "అగ్గిపుల్ల" కథ చాలా బాగున్నది. వీలయినంతవరకు వ్యాసాలు తగ్గించి కథలు ప్రచురించవలసినదిగా కోరుచున్నాను.

*ఐతా రవీంద్రనాధ్*

సూర్యాపేట

రోజూ తొడిగే దుస్తులు

# సన్‌లైట్ వల్ల

ఎంత తెలుపో ఎంత కాంతియో




సొగసుగాను, శుభ్రంగాను, మరియు తెల్లగాను, కాంతిగాను, వుంటవి. మీ బట్టలను వుతికే సన్‌లైట్ గుణం అదే!
మీ బట్టలన్నిటినీ ఇంట్లో సన్‌లైట్‌తో వుతుక్కోండి.

సన్‌లైట్ ఉత్తమ నురగనిచ్చే శుద్ధమైన సబ్బు

S. 32A-X29 TL　　హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ఆగష్టు విడుదల!



కులగోత్రాలు

నిర్మాత..ఏ.వి.సుబ్బారావు * దర్శకత్వం..కె.ప్రత్యగాత్మ

## సౌందర్యం శోభించటానికి







**ఆఫ్ఘన్ స్నో**
సౌందర్య పరికరాలు

# AFGHAN SNOW BEAUTY AIDS

ఆఫ్ఘన్ స్నో సౌందర్య పరికరాలు మీ సౌందర్యాన్నీ కాంతినీ హెచ్చించి పరిపూర్ణతను చేకూర్చ గలవు..... ఆఫ్ఘన్ స్నో సౌందర్య పరికరాలు మీ ముఖవర్చస్సునూ, శరీరచ్ఛాయనూ, శిరోజాలనూ, గోళ్ళనూ సౌకుమార్యముగా సంరక్షించును. మీ సౌందర్య సమస్య లన్నింటినీపరిష్కరించుకోండి.

ఫేస్ క్రీములు & పౌడర్లు★
టాయిలెట్ & టాల్కమ్ పౌడర్లు★
లిప్-స్టిక్స్ & నెయిల్ పాలిష్★
బ్రిలియన్టయిన్స్ & హెరాయిల్స్★
లెవెండర్స్&పర్ఫ్యూమ్స్★
టాయిలెట్ సబ్బులు★

యువ
సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 6 ఆగష్టు 1962 సంచిక 2

ఆలిండియా రేడియో ద్వారా తమిళభాషను బోధించడానికి ఏర్పాట్లు జరుగుతున్నట్లు ప్రభుత్వ ప్రకటన జరిగింది. ఇది, తమిళులను తృప్తిపరచడానికి ఒక ప్రయత్నం.

చిరకాలంగా, హిందీపాఠాలను రేడియోద్వారా ప్రసారం చెయ్యడం జరుగుతూనే వుంది. ఈ పాఠాలను విని దక్షిణదేశంలో ఎంతమంది హిందీభాషను నేర్చుకొన్నారనేది వివాదాంశము. అయినా హిందీని దేశమంతటా ఇంగ్లీషుకు బదులు ప్రభుత్వ భాషగా వ్యవహారంలోకి తీసుకొనిరావడం ప్రభుత్వ విధానం గనుక, హిందీ భాషను నేర్చుకోదలచిన వారికి ఒక సౌకర్యాన్ని ఆలిండియా రేడియోవారు కల్పించడంలో శంకించవలసినది ఏమీలేదు.

కాని, రేడియోద్వారా తమిళ భాషను బోధించడానికి ప్రభుత్వం నిర్ణయించిందంటే, భారతదేశంలో తక్కిన భాషలు మాట్లాడేవారంతా అభ్యంతరం చెప్పవలసి వస్తుంది. ముఖ్యంగా, వింధ్యకు దక్షిణానవున్న తెలుగు, కర్ణాటక, మలయాళ, మహారాష్ట్ర ప్రజలకు ఇది చాలా అభ్యంతరకరమైన విషయం.

ఉత్తరాది ప్రజలకు ఏదోఒక దక్షిణదేశపు భాషను నేర్చుకొనే సదుపాయాన్ని కలిగించడమే కేంద్రప్రభుత్వపు విధానమైతే, అలాటి అర్హతగల భాష ఏది అని పరిశీలించి ఒక నిర్ణయానికి రావలసివుంది.

ఈనాడు దక్షిణదేశం ఏది అనే విషయమై స్పష్టంగా నిర్ణయించవలసివుంది. ఉత్తరప్రదేశ్‌కు, మధ్యప్రదేశ్ దక్షిణదేశమే. మధ్యప్రదేశ్‌కు ఆంధ్రప్రదేశ్ దక్షిణ దేశమే. ఆంధ్రప్రదేశ్‌కు మదరాసు (తమిళదేశం) దక్షిణదేశం అయితే, మైసూరు (కర్ణాటదేశం)కు కేరళరాష్ట్రం దక్షిణదేశం అవుతుంది. కేరళరాష్ట్రానికి ఉత్తరదేశ మైన మైసూరు, మహారాష్ట్రకు దక్షిణదేశం కాగా, మహారాష్ట్ర దేశం గుజరాత్‌కూ, గుజరాత్ దేశం రాజస్తాన్‌కూ దక్షిణదేశం అవుతుంది. ఇలాగ, ఉత్తర దక్షిణాలను నిర్ణయించడం, ఒక అర్ధంలేని పని అవుతుంది. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే, రాయల సీమ వారు విశాఖపట్టణం, గోదావరి, కృష్ణా జిల్లాల వారిని ఉత్తర సర్కారు వారని నిర్దేశిస్తూవుంటే, గోదావరి జిల్లావారు విశాఖపట్టణం వారిని ఉత్తరాదివారని అనడం పరిపాటి అయింది. అంచేత, యీ ఉత్తర, దక్షిణాల నిర్ణయం ఒక సమంజసమైన పద్ధతిమీద జరగవలసివుంది. పూర్వకాలంలో భారతదేశం వింధ్యకు దక్షిణానవున్న భాగం దక్షిణదేశం అనీ, దానికి ఉత్తరాన వున్న భాగం ఉత్తరదేశం అనీ వ్యవహ రింపబడేది. ఆ పద్ధతిమీద చూస్తే, వింధ్యకు దక్షిణాన నేడు అయిదు భాషారాష్ట్రాలు వున్నాయి : అవి, ఆంధ్రప్రదేశ్, తమిళదేశం (మదరాసు), కేరళ, కర్ణాటక (మైసూరు), మహారాష్ట్ర.

ఉత్తరదేశీయులకు, దక్షిణదేశపు భాషలలో దేనినైనా నేర్పాలనేది ప్రభుత్వపు ఉద్దేశం అయితే, యీ అయిదు భాషలలో దేనిని నేర్పడం సులభం, ఏ భాషకు ప్రాధాన్యతను ఇవ్వాలి అనేది పరిశీలించడం అవసరం.

మహారాష్ట్రభాష సంస్కృత పదాలను, హిందీ పదాలను ఎక్కువగా కలిగి, దేవనాగరి లిపినే అవలంబించి, హిందీభాషకు చాలా దగ్గర వున్నందుననూ, ఆ భాషను మాట్లాడేవారి సంఖ్య మూడుకోట్ల ముప్ఫయి లక్షలు అయి, తమిళం మాట్లాడేవారి సంఖ్యకంటె కూడా తక్కువగా వున్నందుననూ, మహారాష్ట్ర భాషను వదలివేద్దాము.

ఇక మిగిలినవి : తెలుగు, తమిళం, కర్ణాటక, మలయాళ భాషలు. భారతదేశపు మొత్తంలో, యీ నాలుగు భాషలను మాట్లాడేవారి సంఖ్యలు, వరుసగా ఇవి · తెలుగు, నాలుగుకోట్లు; తమిళం, మూడుకోట్ల అరవై లక్షలు, కర్ణాట భాష, రెండు కోట్లు, మలయాళం, ఒకటిన్నర కోట్లు, అంచేత, దక్షిణదేశంలో ప్రధానభాష, తెలుగు. భాషాసిద్ధాంతంపై ఏర్పాటుచేయబడిన రాష్ట్రాల వైశాల్యం లెక్కలోకి తీసుకుంటే, దక్షిణదేశంలోని నాలుగు రాష్ట్రాలలోను ఆంధ్రప్రదేశ్ వైశాల్యమే ఎక్కువ.

...ప్రజలు మాట్లాడే తెలుగుభాషకు, పూర్వపు బ్రిటిషు ప్రభుత్వం వారు ...ప్రాధాన్యతను చెప్పాలంటే, ఆనాటి అణా, బేడ, పావలా నాణెములను ...లిస్తే తెలుస్తుంది. ఆ నాణెములమీద, ఇంగ్లీషు భాషలో కాక, ఉర్దూ, హిందీ, ...గాలి, తెలుగుభాషలలో మాత్రం ఆ నాణెముల విలువను తెలియపరచే మాటలు ...దేవి. అంటే, బ్రిటిషువారు విదేశీయులు గనుక, నిష్పక్షపాతంగా దేశంలో అధిక ...ఖ్యాకులు ఏభాషలను మాట్లాడుతున్నారో, ఆ భాషలనే నాణెములమీద ఉపయో...వారన్నమాట. ఈ భాషలలో దక్షిణదేశపు భాషగా ఉపయోగించడానికి అర్హత కలిగినది, ఒక్క తెలుగు మాత్రమే.

అలాగే, నిష్పక్షపాతంగా భారతదేశపు భాష లన్నిటినీ పరిశీలించి, జె.బి.ఎస్. హాల్డేన్ అనే ప్రముఖ విజ్ఞానవేత్త, భారతదేశం అంతటికీ ప్రభుత్వభాషగా వుండడానికి అర్హతగలది తెలుగు భాష అని -కొంతకాలం క్రిందట వ్యాసాలు వ్రాశాడు. ఈ అర్హతను నిర్ణయించడంలో, ఆయన చెప్పిన ముఖ్యాంశాలు ఏమిటంటే : తెలుగు భాష మార్దవమైనది. తెలుగులో సంస్కృత, అరబ్బీ, ద్రావిడ, ఇంగ్లీషు, ఫ్రెంచి పదాలు చక్కగా మిళితంఅయి, ఉచ్చారణకు చాలా సులభంగా వుంటాయి. దక్షిణదేశంలో ఎక్కువమంది మాట్లాడే భాష తెలుగు. అంతేకాక, తమిళ, కర్ణాటక భాషలు మాట్లాడేవారు తెలుగును అర్థంచేసుకోగలరు. తెలుగును నేర్చుకోవడం, వీరికి అతి సుళువు.

హాల్డేన్ వాదాన్ని అనుసరించి తెలుగును భారతప్రభుత్వపు వ్యవహార భాషగా నిర్ణయించవలసిందనే సూచనను మేము ఇప్పుడు చెయ్యటంలేదు. కాని, దక్షిణదేశపు భాషలలో ఒక భాషను నేర్చుకొనే సదుపాయాన్ని ఉత్తరాదివారికి కలిగించడానికి ఆలిండియా రేడియోద్వారా ఏర్పాటు చెయ్యడం ప్రభుత్వపు నిర్ణయమైతే, అలా ఏర్పాటుచెయ్యవలసినది, తెలుగును బోధించడానికిగాని తమిళ భాషను బోధించడానికి మాత్రం కాకూడదని చెప్పగలము.

అన్నివిధాలా అర్హతగలిగిన తెలుగు భాషను వెనుకకునెట్టి, తమిళ భాషకు ప్రాధాన్యత ఇవ్వడంలో, కేంద్రప్రభుత్వం తాత్కాలికమైన క్షుద్ర రాజకీయ కారణాలకు ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నట్టుంది.

''ఉత్తరాదివారు మమ్మల్ని దోచుకుంటున్నారు, ఉత్తరాదివారి ప్రాబల్యం ఎక్కువగాగల కేంద్రప్రభుత్వం, దక్షిణాదివారిని సవతితల్లి ప్రేమతో చూస్తోంది; దక్షిణదేశపు అభివృద్ధికి శ్రద్ధ తీసుకోవడంలేదు; అంచేత, మేము ద్రవిడనాడు అనే

ప్రత్యేక రాజ్యంగా విడిపోతాము'' అని కొందరు తమిళులు ప్రచారం చే
దానికి కేంద్రప్రభుత్వంలోని పెద్దలు జడిసి, కేంద్రప్రభుత్వపు ప్రాజెక్టులలో
మైన వాటిని, తక్కిన దక్షిణ రాష్ట్రాలనోట మట్టిగొట్టి, తమిళదేశంలోనే స్థాపిం
జరుగుతోంది.

తమిళులు విడిపోయి, ప్రత్యేక రాజ్యంగా ఒక్కక్షణం బ్రతకగలరా? వు
తిండికి ధాన్యం ఎక్కడనుంచి వస్తుంది? దేశమంతటా అలముకొనివున్న వం
ఉద్యోగుల మాట ఏమిటి? వీరి మిల్లులలో ఉత్పత్తిఅయే నూలును, బట్టలను ఏ
అమ్ముతారు? బెదరింపులకు జడిసే కేంద్రప్రభుత్వాన్ని లొంగదీసుకుని తక్కిన
రాష్ట్రాలకు అన్యాయంచేసి, సమస్త సదుపాయాలను పొందడానికి తమిళులు వేసే
ఎత్తులను బాగా అర్థంచేసుకోగల నాయకులు కేంద్రప్రభుత్వంలో లేకపోవడం
శోచనీయం.

పైగా దక్షిణదేశం అంటే, తమిళనాడు మాత్రమే అనే పొరపాటు అభిప్రా
యాన్ని కేంద్రప్రభుత్వం సవరించుకోవాలి. పొరపాటు కాకపోతే, దక్షిణదేశపు
భాషలలో తమిళభాషకు ప్రాముఖ్యత ఇవ్వడంలో అర్థమేమిటి?

తమిళభాష చాలా పురాతనమైనదనే వాదం ఒకటి రావచ్చును. అంతకన్న
పురాతనమైన భాషలను మాట్లాడేవారు వున్నారు. సవరల భాష ఏనాటిదో, చెంచుల
భాష ఏనాటిదో, లంబాడీల భాష ఏనాటిదో, తోడాల భాష ఏనాటిదో, ముండాల
భాష ఏనాటిదో ఎవరు చెప్పగలరు!

ఈనాడు మనం నిర్ణయించవలసినది, భారతదేశపు పదిహేను రాష్ట్రాలు సమా
నంగా అభివృద్ధి పొందుతున్నాయా లేదా అనేది. అలా చూసేటప్పుడు, దక్షిణాది,
ఉత్తరాది అనే రెండు విభజనలకు తావులేదు. అలాటి విభజనను పరిగణించే
టట్లయితే, దక్షిణాది అంటే ఏప్రాంతం అని స్పష్టంగా నిర్వచించవలసి వస్తుంది.
అలా నిర్వచించడంలో, దక్షిణాది అంటే తమిళదేశం మాత్రమే అని చెప్పే
టట్లయితే, తమిళదేశం ఏ మాత్రం వెనుకపడి వుండలేదని స్పష్టంగా చెప్పగలం.
మదరాసు నగరంనుంచి కన్యాకుమారివరకు ప్రబలుతూవున్న పరిశ్రమలను బట్టిగాని,
మదరాసునుంచి అన్నిప్రాంతాలకూ వున్న రోడ్డు, రైలుమార్గాలను బట్టిగాని,
మదరాసులో ఏర్పాటయిన కేంద్రప్రభుత్వ పరిశ్రమలనుబట్టి గాని, తమిళదేశం చాలా
అభివృద్ధికి వచ్చిన రాష్ట్రం. కేంద్రప్రభుత్వం స్థాపించే పరిశ్రమలు, ఢిల్లీలోని ఏ
కొద్దిమంది డబ్బుతోనో ఏర్పడేవికావు. తక్కిన రాష్ట్రాలన్నిటినుంచీ కేంద్ర
ప్రభుత్వం వసూలుచేసే పన్నులతో ఏర్పడినవి. జాగ్రత్తగా లెక్కలు చూస్తే,

మదరాసు రాష్ట్రంనుంచి కేంద్రప్రభుత్వం వసూలుచేసే పన్నులకన్న ఎక్కువ డబ్బునే మదరాసు రాష్ట్రంలో కేంద్రప్రభుత్వం ఖర్చుపెడుతోందేమో కూడా.

అలాంటప్పుడు మదరాసు రాష్ట్రాన్ని కేంద్ర ప్రభుత్వం సరిగా చూడడంలేదని ఎవరూ చెప్పజాలరు అందుచేతనే, తమిళులు కూడా మదరాసు అనే పదానికి బదులు దక్షిణ దేశం అనే పదాన్ని వుపయోగించి, దక్షిణ దేశపు వంతుకు రావలసిన కేంద్ర ప్రభుత్వ ప్రాజెక్టులన్నిటినీ తామే కొట్టుకుపోతున్నారు.

ఈ పొరపాటు భావంవల్లనే, యీనాడు కేంద్ర ప్రభుత్వం, తమిళ భాషను రేడియో ద్వారా బోధించడానికి పూనుకోవడం జరుగుతున్నది

తమిళ సభ్యుడు ఎవరైనా పార్లమెంటులో లేచి 'దక్షిణ దేశం' అని అన్నప్పుడల్లా, 'మీరు తమిళనాడును గురించి మాట్లాడుతున్నారా, లేక ఆంధ్ర కర్ణాటక, మళయాళ దేశాలను కూడా కలిపి మాట్లాడుతున్నారా ? అలా కలిపి మాట్లాడుతున్నట్లయితే, తమిళనాడుకన్న ఎక్కువ ప్రజ, ఎక్కువ నేలగల ఆంధ్రదేశం మీ తమిళనాడు పొందిన అభివృద్ధిలో సగం కూడా పొందలేదు కాబట్టి, ఆ విషయం కూడా స్పష్టంగా చెప్పండి," అని ఆంధ్ర సభ్యుడెవరైనా అడగాలి.

లేదా, దక్షిణాది అంటే తమిళదేశాన్నే ఉద్దేశించి, ఆ తమిళ సభ్యుడు మాట్లాడుతున్నట్లయితే, ఆ విషయం ప్రత్యేకంగా గమనించవలసినదనీ, ఆంధ్రప్రదేశ్‌ను విడిగా, దాని అర్హతను బట్టి తగిన విధంగా అభివృద్ధికి వచ్చేటట్టు సౌకర్యాలను కలిగించవలసిందనీ కేంద్ర ప్రభుత్వాన్నీ, ఉత్తరాది సభ్యులనూ ఆంధ్ర సభ్యులు హెచ్చరించాలి

ఈ విధంగా స్పష్టమైన వివరణ లేకపోతే, ఆంధ్రప్రదేశ్ పైపు కేంద్ర ప్రభుత్వపు దృష్టి పడదు

భారతదేశం, అనేక రాష్ట్రాల సమాఖ్య అన్ని రాష్ట్రాలకూ, వాటి జనాభాను బట్టీ వైశాల్యాన్ని బట్టీ యథోచితమైన ప్రోత్సాహాన్ని కేంద్ర ప్రభుత్యం ఇవ్వాలి కాని, అలాంటి సద్భావం కేంద్ర ప్రభుత్వానికి ఉన్నట్టు కనపడదు

లేకపోతే, దక్షిణ భాషలలో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడేదీ, అతి సులభంగా నేర్చుకోవడానికి వీలుగలదీ అయిన తెలుగును వదలి, ఉచ్చారణకు కఠోరమైనదీ, అసంబద్ధమైన లిపిగలదీ అయిన తమిళ భాషను రేడియో ద్వారా బోధించడానికి కేంద్ర ప్రభుత్వం పూనుకోవడంలో అర్థమేమైనా ఉన్నదా ? పైగా, రేడియోశాఖ మంత్రి ఆంధ్రుడు ఆంధ్రభాష అర్హతలు ఆయనకు తెలియవని అనుకోగలమా !

ఇది మనికొక దురదృష్టమే



# చిల్లర దేవతల పాట్లు



పోతురాజన్నా ఏమిటి విశేషాలు ?"

'నీ గుడీ, నీ పీరకం దక్కించుకోంగానే సంబరం కాదమ్మా ! ఊరు ఊరంతా గగ్గోలుగా ఉంది; నల్లమారెమ్మ నాయుడి బార్యామీదపూని కొత్త నెనువు తన పేరు మీదుండాలంటున్నది. తంబిళ్లమ్మ బలులు, ఏటలు సాలవంటూ ఊంకారం చేస్తాఉంది, దురగాలమ్మ గుళ్లో తీగి దీపాలు కావాలంటూ, పడమటమ్మ పట్నానికి నేరుగా రోడ్డు, గొంతేలమ్మ కోరికలింక చెప్పేలేను, ఇంత నీ గుడీ నీ వాడా సంగతి నివ్వేం జేసుకుంటావో. నీ సత్తెం ఎట్టా జూపిస్తావో మరి "




# పనిలేని మంగలి

బెర్నాడ్‌షా ప్రజాస్వామిక విధానంలో చాలా లోట్లున్నవి అన్నాడు. ప్రజలు కొందరు అవుననటానికీ, మరికొందరు కాదనటానికీ ప్రతినిధులను ఎన్నుకోవటంలోనే ఆలోటు స్పష్టంగా కనిపిస్తూవుంది. పైగా మనదేశంవంటి దేశంలోని రాజకీయ పార్టీలు ప్రజల శ్రేయస్సుకోసం కాక అధికారంకోసం ప్రాకులాడు కోవటంతో ప్రజాస్వామిక విధానం భయంకర రూపం దాల్చినదనటంలో సందేహంలేదు.

పదవీ వ్యామోహం మానవ స్వభావాన్ని తల్లకిందులు చేసేమాట కూడా నిజమే. అధికారంలోకి వచ్చిన మనిషి కొద్దో గొప్పో మారకుండా వుండడు. తన అధికారాన్నీ, తన పార్టీని బలపర్చుకోడానికి కొన్ని అవక తవకలు చేయకుండా వుండడు ఇదీ నిజమే.

ఇటువంటి లోపాలు ప్రజాస్వామిక విధానంలో ఉన్నట్టు మన అనుభవంలోకి వస్తున్నవి. అందువల్ల మేధావంతులు యింతకంటె మంచి విధానం ఏదన్నా ఉన్నదేమోనని అన్వేషణ ప్రారంభించారు. ఇందుకు కొంతమంది కొన్ని సూచనలను పత్రికలద్వారా ప్రకటించారు కూడా.

వాటిల్లో ముఖ్యమైంది పార్టీరహిత ప్రజాస్వామ్యము. పార్టీలవల్ల ప్రజాస్వామికం భ్రష్ట పడుతూందని వీరి వాదము. అందువల్ల పార్టీలులేని ప్రజాస్వామికాన్ని వీరు అన్వేషిస్తున్నారు. అయితే ఎంతవరకూ యిది సాధ్యమో మనం ఆలోచించాలి.

పార్టీలు లేకుండా ప్రజా స్వామికాన్ని నడిపేది ఎట్లా ? అనేది ప్రశ్న. ఎన్నికలు అనేవివుంటే ప్రజలు ఈ నాటి పరిస్థితుల్లో సరైన ప్రతినిధులను ఎన్నుకుంటారనేది వట్టి దురాశ. ఆ విషయం మనకు అనుభవంలో తెలుస్తూ వున్నది. అయినప్పుడు ప్రభుత్వం నడిచేదెలా ? ఏదో కొద్దిమంది మంచివాళ్లు ఆ పని చేస్తారనుకుందామంటే ఆ మంచి వాళ్ళను

ప్రజలను పరిపాలించే స్థితికి ఏ విధంగా తేవాలి? ఎవరు తెస్తారు? ఒకవేళ అటువంటివారు అధికారంలోకి వచ్చినా వారిని ఎక్కువకాలం దుర్మార్గులా పద వుల్లో ఉండనివ్వరని చరిత్ర చెబుతోంది. పైగా ప్రతిదేశానికీ సైన్యం అనేది ఒకటి వుంటుంది ఈ సైన్యం బెడద నుండి తప్పించుకునేదెలా? మంచితనానికి పోయిన ప్రముఖ నాయకులు సైన్యం ఒత్తిడికి తట్టుకోలేక పదవీచ్యుతులవటం, సైన్యం అధికారాన్ని స్వీకరించి, ప్రభుత్వాన్ని నడపటం నేడు మనం కళ్ళారా చూస్తూ వున్నాం. ఈనాడు ప్రపంచంలో సైన్యం బెడద చాలా ఎక్కువగా వున్నట్లు అనేక దేశాల చరిత్రలు చాటి చెబుతూన్నవి పార్టీ రహిత ప్రజాస్వామికం ఈ బెడదనుంచి తప్పించుకునే ఉపాయాన్ని యింత వరకూ కనిపెట్టలేదు (ఏదో ఒకదేశం సైన్యాన్ని రద్దు చేస్తే, ప్రక్కనున్న మరొకదేశం వచ్చి, సునాయాసంగా తిష్ఠ వేస్తుంది.)

ఈవిధంగావున్న పరిస్థితులను గమ నిస్తే రాజకీయ పార్టీలకు సంబంధంలేని విధానం ఇప్పట్లో ఆచరణసాధ్యం కాదని అనిపిస్తూవుంది. అయితే ఎల్లకాలమూ ఈ పార్టీలు వుండవలసిందేనా అంటే వుండనక్కరలేదు. పార్టీరహిత ప్రజా స్వామికం ప్రస్తుతపరిస్థితులలో అసాధ్యం గనుక దాని ప్రచారాన్ని ఆపివేయవలసిం దేనా అంటే ఆపివేయ నక్కరలేదు. కొంతకాలంవరకూ ఈ రెండు దృష్టులూ ఒకదానొకటి ప్రభావితం చేసుకుంటూ, పునీతం చేసుకుంటూ ముందుకు సాగిపో వలసిన అవసరం కనిపిస్తూంది. ప్రస్తుత పరిస్థితుల్లో పార్టీ సహిత ప్రజాస్వామికం ఉండవలసిన అవసరం రెండో దృష్టి గలవారు అంగీకరించాలి అదేవిధంగ మొదటి దృష్టిగలవారు పార్టీ రహిత ప్రజాస్వామికాన్ని ఆదర్శంగా గుర్తిం చాలి అప్పుడు పార్టీలు ఈ ఆదర్శాన్ని సాధించడానికి కృషి జరుపుతవి.

చాలామంది గమనిస్తున్నట్లు లేదు గాని, ఈ ప్రయత్నం నెహ్రూ నాయ కత్వాన మన దేశంలో సాగుతూనేవుంది ప్రముఖ విషయంలో యితర పార్టీ నాయకులతో సంప్రదించటం, వారి సహ కారం తీసుకోవటం ఈ ప్రయత్నానికి ముఖ్యమైన పాతిప్రదిక ఈ ప్రాదిపది కను వీలైన వుడల్లా ఆచరణలోకి తేవ డానికి ప్రయత్నిస్తూన్నాడు మన ప్రధాని నెహ్రూ ఆయన ప్రయత్నాన్ని యితర నాయకులును, ప్రజలూ హృదయపూర్వ కంగా తోడ్పడితే ప్రజాస్వామ్యాన్ని అధిగమించిన మరొక విధానాన్ని, ప్రపం చానికి ఆదర్శంగా వుండే విధానాన్ని మనం తొందరలోనే పొందగలుగుతాం.






తరాలనాటి ఆ పెద్ద భవనం బీటలువిచ్చి ముసలివాని శరీరంపై తేలిన నరాల్లా శిధిలావస్థలో వుంది. ఎందరి గాధల్నీ, బాధల్నీ ఇముడ్చుకొని జీర్ణింపచేసుకుందో మన వూహకే అందని సంగతి

ఆ భవనం ముందొక రిక్షా ఆగింది అందులోంచి ఒక పాతికేళ్ళ పడుచు నిర్జీవంగా నిరామయంగా దిగి వెళ్ళి ఇంటి తాళాలు తీసి తడబడే అడుగులతో లోపలి కెళ్ళింది. ఆమెను ఆప్యాయంగా కౌగలించుకొందా పెద్ద గది

* * *

రామారావుగారు సొంత వూరిలోనే హైస్కూల్ మాష్టరుగా పనిచేస్తున్నారు పెద్దలు మిగిల్చిన ఆ భవనం, కొంత పొలమూ వుందాయనకు. 30 సంవత్సరాలొచ్చినా వివాహ ప్రసక్తి తేనిచ్చేవారు కాదు తల్లిని కారణం ఎవరికీ తెలియదు ముసలి తల్లి కాస్తా కన్నుమూశాక శాఖాంతర వివాహం చేసుకున్నారు (వర్ణాంతర వివాహంకాదు). ఆరోజులలో అదే చెయ్యరాని నేరంగా వుండేది. భార్య అందమైనదీ, వెన్నపూసలాంటి మనసు కలదీను. వారిద్దరికీ సమాజంతో సంబంధం వుండేది కాదు. వారిద్దరికీ ఏ విషయాల్లోనూ భేదాభిప్రాయా లుండేవి కావు

చాలాకాలానికి వారికొక ఆడపిల్ల పుట్టింది వారి ఆనందానికి అవధులులేవు

ఆ పిల్లకు శశి అని పేరు పెట్టారు. అందంగా కుందనపు బొమ్మలా వుండేది శశి. వారి అభిరుచుల కనుగుణంగా శశిని పెంచసాగేరు కాలం త్వరగా గడచి పోయింది. ఎనిమిది సంవత్సరాల తరువాత రామారావుగారి భార్య పార్వతి మరల గర్భవతి అయింది. అనారోగ్యంగా వుండేది ఎప్పుడూ. ఏడవ నెలై వుండగా ఒకనాడు తెలివిలేకుండా పడిపోయింది. హాస్పటల్‌కి తీసుకెళ్ళేరు. కాని ఆమె ఒక్కరోజు మాత్రమే వుండి చనిపోయింది. శశికి తల్లి అనే పెన్నిధి కరువైంది. రామారావుగారు శశిలో భార్య రూపాన్ని చూసుకొనేవారు. పని మనిషి సహాయంతో ఎలాగో కాలం గడుపుతూ వుండేవారు. శశి చాలా తెలివైంది. తొమ్మిదవ సంవత్సరం రావడంతోనే హైస్కూల్‌లో జాయినయ్యింది. తండ్రితోపాటు తనూ వెళ్లేది. సాయంత్రం మాత్రం ఆలశ్యంగా వచ్చేది ఇంటికి, స్నేహితులతో ఆడి, పాడి ఒక్కోరోజు అందరూ శశి యింటికే వచ్చేవారు. చమత్కారి అయిన శశి అందర్నీ నవ్విస్తూ వుండేది. శశి స్కూల్ ఫైనల్ చదువుతుండేటప్పుడు 5 గురు ముఖ్య స్నేహితు లుండేవారు. తరచు వస్తూవుండేవారు. అందరూ కలసి తెలుగు మాష్టారి తెలివిని మెచ్చుకుంటూ ఇంగ్లీషు మాష్టారి స్టయిల్‌ని అభినయిస్తూ, లెక్కల మాష్టారి బుర్రలో ఎంత బంకమన్నుందో ఆయన డిగ్రీ ఏవిధంగా సంపాదించి వుంటాడో వూహించి, ఒకరికొకరు చెప్పుకొని నవ్వుకునేవారు. సమవయస్కులయిన వారి అభిరుచులన్నీ చాలావరకు, ఒక్కలాగే వుండేవి. లలిత, రామంలు చాలా తెలివైనవారు. ధృవ, శశి అల్లరి వాళ్లు. పాణి, సీత అమాయకంగా ఉండేవారు. అందరూ కష్టపడి బాగానే చదివేరు. కాని పాణి, సీతలు తప్పేరు. లలిత, రామం, ధృవ కాలేజీ చదువుకి హైద్రాబాద్ వెళ్ళేరు. శశి తండ్రి ఎంత చెప్పినా తనొక్కతీ తండ్రిని వదిలి పోలేనని చెప్పింది. చదువుమీద కూడా శ్రద్ధ లేదని చెప్పేసింది. సీతకు సంబంధం స్థిరపడింది. పాణిని ఒక అందమైన పెద్దసైజు హిడింబకు ఇచ్చారు, (ఇల్లరికం) లక్షాధికారులని.

శశికి ఏమీ తోచేదికాదు. వంటరితనం భరించలేనంత దుర్భరంగా వుండేది. లలిత, రామం, ధృవలకు తరచు ఉత్తరాలు వ్రాస్తూ జవాబులు పొందుతూ గాలిలో తేలిపోతుండేది అక్కడి విషయాలు తెలుసుకొని — తను చదువు మానేసినందుకు అప్పుడప్పుడు తనమీద తనకే కోపం వచ్చేది — రామం చాలా పెద్ద ఉత్తరాలు వ్రాసేవాడు. బూజుపట్టిన భావాలను ఎలా దులపాలో, అందువల్ల కలిగే లాభాలు ఏమిటో, ఎంతమంది 'సమాజం' అనే పాముకాటుకు బలౌతున్నారో, వ్యక్తిత్వం ఉన్న ప్రతీవారూ

కూడా సమాజంతో అంతర్గతంగా సమరం సాగిస్తూనే వుంటారని, కాని ఇలా తనకు జరుగుతున్నట్లు ఏ ఒక్కరూ పైకి చెప్పరనీ, నిర్భయంగా చెప్పుకో గలిగినవాడే నిజమైన మానవుడనీ, సంకుచిత భావాలతో కుళ్ళు బ్రతుకు బ్రతికే అందరినీ 'మానవులు' అనడం సబబు కాదనీ, ఏమేమో గాలిలో మేడలు కడుతున్నట్లు వ్రాసేవాడు. శశికి అతని భావాలు బాగుండేవి తను చెప్పలేనివి ఏమిటో అతను చెపుతున్నాడనుకొనేది.

*   *   *

ఆ శెలవుల్లో మిత్రులంతా చేరుకున్నారు. రాత్రంటే ఏమిటో పగలంటే ఏమిటో వారికి తెలిసేదికాదు. రామారావు గారు కూడా యుక్తవయసు వచ్చిన పిల్ల అని కాని, సమాజం తమని ఏమంటుందో అని కాని ఏ ఒక్కరోజూ ఆలోచించలేదాయన. పైగా అలా ఆలోచించడం తప్పు ఆయనకు. కుమార్తె తన ఆదర్శాలను నిలబెడుతుందని కలలు కనేవారు. వాళ్ళతోపాటు ఈయనా శృతి కలిపి నవ్వుతుండేవారు.

శశి మనసు తేటనీటి సరస్సులా నిర్మలమైనది. అందరి ప్రతిబింబాలు ఆమెలో కనుపించేవి. ప్రతివారూ 'నేనున్నానా నీలో?' అంటూ ఆమెలో తమని చూసుకొని తృప్తిగా నవ్వుకునేవారు. శశి తన మంచి మనసుతో అందర్నీ కట్టేసుకునేది. ఆమె చెప్పిన



"ఏడుకొండల వెంకటరమణా, నేను చైర్మన్ అవుతే నా జుట్టు నీకు ఇస్తాను."

మాట కాదనేవారెవరూ ఆ వూరిలో వుండేవారు కాదు. అలా అని అందర్నీ పూసుకు తిరిగేది కాదు. అందుకే ఆమెకు లోకమంతా అందంగా, గులాబీ తోట లాగే కనుపిస్తుంది. ఆ ముళ్ళని మాత్రం మరచిపోతూ వుంటుంది.

*   *   *

రామంకి క్లాస్ వచ్చింది. మెడిసిన్‌లో చేరేడు. లలిత, ధృవలు బి యస్‌సి. లో చేరేరు.

శశికి ఒక సంబంధం వచ్చింది. అతను ఏదో కంపెనీలో మేనేజర్‌గా వుంటున్నాడు. అతనికి వర్ణాంతర వివాహం చేసుకొని గొప్ప పేరు తెచ్చుకోవాలని కోరిక కలిగింది. ఒకరి నొకరు చూసుకున్నారు — రామారావుగారు శశి అభిప్రాయం అడిగేరు. శశికి పెండ్లంటే జీవిత సమస్య అని తెలియదు. అంత

గట్టిగా అసలే ఆలోచించలేదు. ఆమె పెరిగిన వాతావరణం అలాంటిది. 'నీ యిష్టం నాన్నా! నాదేం లేదు' అని మన స్ఫూర్తిగానే చెప్పింది. సంఘసంస్కర్త కాబట్టి కట్నం అడగకూడదు 'కారు' కొనిపెట్టమన్నాడు. ఆస్తిఅంతా తరువాత తనదే కదా అనుకున్నాడా పెండ్లికొడుకు. రామారావుగారు కూడా సరే నన్నారు

పెండ్లికి స్నేహితులంతా వచ్చారు పెత్తనమంతా వారిదే! కాని ఏ ఒక్కరూ సరదాగాలేరు. శశి యింక తమని ఒదిలి వెళ్ళిపోతుందని అందరికీ బెంగ. పెండ్లి కొడుకు గోపాలరావుగారి తరఫునా, యిటు శశి తరఫునా అందరూ స్నేహితులే. పెండ్లి జరిగిపోయింది శశిని పంపించేటప్పుడు రామారావుగారు బావురుమని పసిపిల్లాడిలా వెక్కి-వెక్కి ఏడ్చారు. శశి ఎలావుందో చెప్పడం అసలే అనవసరం శశి స్నేహితులంతా పక్క-పక్కలకుపోతూ కన్నీటిని ఆపుకొనే వృధా ప్రయాసపడుతున్నారు ఈ సమయంలో ఏడవరాదనేది తెలుసు కొని రామం మాత్రం శశి దగ్గరగావచ్చి నుంచొని జీరపోయిన గొంతుతో 'శశీ' అన్నాడు. శశి తల పైకెత్తి రామంని చూసి తల వంచేసుకొంది. ఏదో చెప్ప బోయిన రామం పెదవులు వణుకుతున్నాయ్ మాట రాలేదు చాలా ఫొటోలున్న ఒక ఆల్బమ్ ఇచ్చి భారంగా వెళ్ళిపోయాడు తిరగేసి అన్నీ చూసింది శశి తన స్నేహితుల 'ఫొటో' లవి ఎక్కడ సేకరించాడో! బాధగా నవ్వుకొంది. కారు బయలుదేరింది.

* * *

రామం, లలిత, ధృవలు ఉత్తరాలు వ్రాస్తూవుండేవారు. వాటిని శశి గోపాలరావుగార్కి చదివి వినిపించి ఎవరెవరు ఎలాంటి వారో చెపుతూ వుండేది. ఆయన కూడా ఆసక్తితో విన్నట్లే వుండేవారు రామారావుగారు కూడా తరచు వస్తూ, పోతూ వుండేవారు. షుమారు రెండుసంవత్సరాలు గడిచాయి ఆస్తి అంతా శశి పేర వ్రాసి రామారావు గారు పరలోకంలోవున్న భార్యని కలుసుకున్నారు. తండ్రి మరణం శశిలో ఏదో తీరని వెలితిగా వుండేది నిత్యం ఒంటరిగా ఏదో ఆలోచిస్తూ వుండేది. ఎందుచేతనో గోపాలరావుగార్లో మార్పు వచ్చింది ఆయనకు శశిలో లోపాలు కనుపిస్తూవుండేవి. ఇది గమనించని శశి తనతోపాటే తన భర్తకూడా బ్రతుకు అనే బాట పైన తనపక్క నడుస్తున్నాడని భ్రమించింది. కాని వెనుతిరిగి చూసే సరికి అతను చాలా వెనుకనే వున్నట్లు తెలుసుకొంది శశికి వచ్చే ఉత్తరాలు చించి చదివేవాడు సంసార స్త్రీకి ఇది లక్షణం కాదనేవాడు. పుస్తకాలు చదివితే కవిత్వం మొదలెడతావా? అంటూ వెటకారం చేశేవాడు ఎవరైనా నలుగ రొచ్చి మాట్లాడుతూవుంటే మొఖ

మాడ్చుకునేవాడు సంఘ సంస్కర్త అయిన గోపాలరావుగార్కి యీ లోపాలన్నీకూడా శశిపేర్న ఆస్తి 'వాసేకే ఆమెలో కనుపిస్తున్నాయ్. ఏమీ తెలియని శశికి భర్త చిరాకుకి కారణంగాని, తన నేరంగాని, ఏదీ తెలియక గిలగిలలాడిపోతుండేది. తండ్రినీ, స్నేహితుల్నీ తలచుకొని దుఃఖించేది చేసేది లేక. ఇలాంటి పరిస్థితిలో వుండగా రామం నుండి వుత్తరం వచ్చింది

శశీ !

నా ఉత్తరాలు అందుతున్నాయా ? జవాబు వ్రాయవెందుకని ? నేను బ్రతకడం నీకిష్టం లేదుకదూ ? నా పరిస్థితీ అలాగే వుందిలే నీవిలా మారిపోతావనుకోలేదు మేమెవ్వరమూ నీకు లేమా ? మీ శ్రీవారు సహృదయులని ఇదివరకు వ్రాశావ్ నాకు వ్రాయడం ఆయన ఇష్టపడరా ? అలా జరిగి వుండదనే నా భావన నాకు వారం రోజుల నుండి జ్వరం వస్తోంది. టైఫాయిడ్ అంటున్నారు చాలా నీరసంగావుంది. ఎలాగో ఓపికతో నీకొక్కదానికే వ్రాస్తున్నా ఇంటికింకా వ్రాయలేదు ఎందరు డాక్టర్లొచ్చి చూసినా, నీ మొఖం కనుపిస్తుందా ? నిన్ను చూస్తేనేగాని యీ జ్వరం తగ్గనని మొండికేస్తున్నది ఎందుకో బ్రతుకుతాననే ఆశ క్షీణిస్తోంది. ఇది ఆఖరి వుత్తరం కాకూడదు శశీ ! నీవు తప్పక వస్తావుకదూ ? నీకోసం క్షణ





"నడుం వరకే తియ్యవయ్యా మహానుభావా !"

క్షణం ఎదురుచూస్తూ వుంటా ఒకసారి అన్నావుగా, నాలో సగం నీవని ! ఆ సగం కాపాడుకోవడానికి రావాలి.

నీ

రామం.

'కాలప్రవాహం' అనబడే దానికంటే, ముందు వెళుతున్న రామంకి ఒక వివాహితస్త్రీ ఒక యువకుడైన స్నేహితుడిని చూడటానికి వంటరిగా రాగలదా ? అనే భావమే లేదు. శశి ఆ వుత్తరాన్ని భర్తకు చూపించింది. ఆయననికూడా రమ్మని బ్రతిమాలింది. ఆ వుత్తరాన్ని చించిపారేశాడతను. శశికి లోకమంతా గిరగిరా తిరగసాగింది. తనకి స్వేచ్ఛలేదు బంగారు సంకెళ్లున్నాయని ఇప్పుడే తెలుసుకొంది రామం ఆ చివర నుండి చేతులందిస్తున్నాడు. ఒక్కసారి వచ్చి చూడమని దీనంగా వేడుకుంటున్నా యా కన్నులు. ఆ చేతులు చాలా దూరంగా వున్నాయ్ అందుకోలేదు శశి. ఈ చివర భర్త శిలలా కొన్నియుగాల

వెనుక నిల్చివున్నాడు. తను పయనిస్తూ మధ్యకొచ్చేసింది తెలియకుండానే భర్తకు చెయ్యి అందించింది. తనతోపాటు వచ్చి 'రామం'ని కాపాడమని ఆశతో దీనంగా ప్రార్థించింది. కరినుడు కరగ లేదు. ఆమె మృదు మధురమైన కోమల హస్తాల్ని కౄరంగా త్రోసిపుచ్చాడు. శశికి దిక్కుతోచడంలేదు. తనతోనే వస్తున్న మరొక యువజంట కనుపించారు. వెళ్ళి సలహా అడిగింది. ''అక్కా! నా రామం నాకు ప్రాణం. తల్లికంటే, తండ్రికంటే, సోదరునికంటె చివరకు నాకంటె కూడా నా రామం నాకెక్కువ. మేమిద్దరం కవల పిల్లలం. నాలో సగం రామం. అతను గనిపోతే నేను బ్రతకలేను. అతన్ని కాపాడుకోవాలి. నేనే అతనికి మందు. చెప్పక్కా! నా రామాన్ని చూడటానికి వెళ్ళనా? వెళితే నా భర్త నన్నేమంటాడూ? భారమైన నా బ్రతుకుకు మార్గం చూపించు'' అంటూ విలపించింది శశి ''చెల్లీ! భార్యా భర్తలిద్దరూ ఒకరిప్రక్క ఒకరు పయనిస్తూ వుంటేనే గమ్యం చేరుకుంటారు. కాని నీవు ఎలాగో ముందు వచ్చేశావ్. అలా రావడం స్త్రీలకు హానికరమమ్మా! కనపడని సంకెళ్ళు మనవి. నా మాట విను. వెళ్ళి నీ భర్తని కలుసుకోముందు. అతనువస్తే నీవూ వెళ్ళు. ఇంతకంటే నేనేమీ చెప్పలేను చెల్లీ!'' ఆలోచనలోపడింది శశి. 'జీవితం' అనే పుస్తకాన్ని కొన్ని పుటలే విప్పింది తను. కాని దాన్ని పూర్తిగా చదవకుండానే వుండగా చుట్టి విసరి పారెయ్యమని సలహా ఇస్తున్నది సోదరి. ఇది తనకు సాధ్యమా? వెనక్కి నడవగలదా? తన గమ్యంఏది? ఇలా కుమిలిపోతున్న శశికి ఎన్ని రోజులు గడిచాయో సమంగా గుర్తులేదు. రామం మరణవార్త శశిని కూకటి వ్రేళ్ళతో కూల్చేసింది. ఇంత అసమర్థురాలాతను? పెండ్లంటే ఇదేనా? మధురంగా బ్రతకడమంటే ఇదేనా? తనకి యింకెవరూలేరు. తననెవరూ అర్థం చేసుకోలేరింక. ఆ సమయంలోనే ఆ సోదరి మళ్ళాచెప్పింది. ''ఇంకెందుకు చెల్లీ! అన్నీ సమసిపోయాయ్. ముందుకువెళ్ళి ఎవరిని బ్రతికిస్తావ్? నీకు 'నీది' అనబడేదేమీలేదు. అదంతా నీ భర్తది. నీ భర్తను కలుసుకో. ఇప్పటికే మించిపోయినట్లుంది. త్వరపడు.'' సర్వమూ కోల్పోయాననుకున్న శశి వెనక్కి ఒక్క అడుగు వెయ్యబోయింది. వెనకడుగు చాతగాని శశి 'లోయ'లో పడిపోయింది. అంత ఎత్తులోంచి పడిన శశి నిమ్మదిగాలేచి దులిపుకొని, తగిలినగాయాలనీ, విరిగిన మనసునూ జాగ్రత్తగా శిథిల సౌధమైన తన తండ్రి గృహానికి చేరవేసింది. ఆప్యాయంగా ఆమెను తమవడిలోకి లాక్కున్నాయా గది గోడలు ఎదురీత ఎరుగని పిచ్చిశశి!






ఆమె. చందమామ అందాలకు ఎవరోయీ వారసులూ ?

అతడు· చేపల్లా తుళ్ళే నీ చేరడేసి కనులూ

ఆమె: నీలి నీలి మేఘాలకు ఎవరోయీ వారసులూ ?

అతడు చీకట్లను గేలిసేయు నీ నల్లని కురులూ

ఆమె· పరిగెత్తే మెరపులతో పందెమేయునేవీ ?

అతడు గుండెలలో గుచ్చుకొనే వెచ్చని నీ చూపులూ

ఆమె· సురతామంటే మరపురాని మధురభావ మేదీ ?

అతడు: వెన్నెలకే కందిపోవు నీ చక్కని రూపమూ

ఆమె. చుక్కలనే వెక్కిరించు సుందరాంగి ఎవరో ?

అతడు: పక్కననే వుండికూడ చిక్కబోని నీవ్వా



# మల్లెమొగ్గ జాగ్రత్త

ఉపోద్ఘాతం :

రవి. బి ఎస్‌సి చివరి సంవత్సరం చదువుతూ వున్నాడు. సన్నగా బారుగా తిన్నగా తీరుగా వుంటాడు. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు ఎవర్నీ పలకరించడు. ఎప్పుడయినా ఎవరో పలకరిస్తే గోళ్ళు గిల్లుకుంటూ, తల వంచుకొని తల వూపుతాడు. ఎవరికి అయినా ఎదురుపోతే ఏమయినా పలకరిస్తారేమోనని తప్పుకు తప్పుకు తిరుగుతాడు.

అతను లేకుండా పుస్తకాలు వుంటాయికానీ పుస్తకాలు లేకుండా అతనుండటంలేదు ఆంగ్ల గ్రంథాలంటే అతనికి అమితమయిన అభిమానం. అతను రూంలో వుండక

పోతే లైబ్రరీలో వుంటాడు క్లాసులో మంచి మార్కులు వచ్చే కొద్దిమందిలో అతను ఒకడు. అతనికి కళలంటే కాస్తో కూస్తో అభిమానం కూడా వుంది.

అప్పుడెప్పుడో కథలు కొన్ని గిలికి ఏవేవో పత్రికలకు పంపితే ఎకాఎకి తిరుగు టపాలో తిరిగి వచ్చాయి. కథలు వ్రాయటం కోసం కలం పట్టలేదు అయితే పెనిసిలు పట్టుకున్నాడు బొమ్మలు గీశాడు. కుంచెముట్టుకున్నాడు, రంగులు వేశాడు. అయితే అవి తనకే తృప్తి కలిగించక పోవటంతో ఎక్కడికీ ప్రచురణకు పంపకుండా చేతులు-కాదు కాళ్ళతో కొన్ని పనులు చేయాలనుకొని ఎవరూ లేని సమయంచూచి ఏకాంతంగా తనగదిలో డాన్సు చేయటం మొదలు పెట్టి, అద్దం ఎగతాళిగా వెక్కిరిస్తూవుంటే అదేం లాభం లేదని విరమించుకొని నోటితో ఏదో తతంగం చేయాలను

కొలకలూరి



కున్నాడు. ఎప్పుడయినా కూనిరాగం తీయాలి అని అభిప్రాయం కలిగితే పక్కరూంలో వుండేవాళ్ళు పాట విని ఆనందించలేక కేసుపెట్టి కోర్టుకు లాగి అభాసు చేస్తారని వాళ్ళకి కష్టం కలక్కుండా వుండేందుకు బీచ్‌లోకి పోయి జనానికి దూరంగా కూర్చుని తాపీగా కంఠం విప్పి సాఫీగా పాడుతూవుంటే పీతలు నిక్కిచూచి కన్నాల్లో దాక్కుంటూ వుంటాయి.

రవి సంగతి సందర్భాలు అర్థంచేసుకున్న విద్యార్థులు 'అమ్మాయి' అంటూ వుండేవాళ్లు. ఎప్పుడూ పుస్తకాలతో ఎడం ఎడంగా తిరగటం చూచిన అమ్మాయిలు అతన్ని 'పుస్తకాల పురుగు' అనటం ప్రారంభించారు ఆ రెండు మాటలూ ఆనోటా ఆనోటా పడి అలా అలా సాగి వచ్చి అతని చెవిలో చొరబడ్డాయి. ఆ క్షణంనుంచి అతనిలో విప్లవం వచ్చింది. మహామహావాళ్ళకంటే యమా విప్లవకారుడుగా తయారయిపోయాడు.

రాణి రవి క్లాసుమేటు. ఎర్రగా రీవిగా ఏపుగా నిండుగా వుంటుంది. బట్టలు కట్టుకోవటంలో క్రొత్తక్రొత్త పద్ధతులు ఆమె కనిపెడుతూ వుంటుంది గొప్ప చిత్రకారుడుగా పేరుపొందిన వ్యక్తి ఆమె అవయవ నిర్మాణం చూచి చిత్తరపోయి, మాటా పలుకూ లేకుండా బ్రమాన్పడి పోయాడట! రెండు జడలూ రెండు కళ్లా ఆమె నడుస్తుంటె తిరిగి తిరగటం చూడాలేకాని...అని విద్యార్థుల అభిప్రాయం.

ఆమె చుట్టూ ఆడపిల్లల జట్టు ఒకటి ఎప్పుడూ వుంటుంది అందరూ అల్లరిలో ఆరితేరిన ఘటాలు. ఆమె ఎప్పుడూ వసపిట్టలాగా మాట్లాడుతూ వుంటుంది. క్లాసులో పాఠం వినదు. మిగతావాళ్ళని విననివ్వదు. ఆమెకు అల్లరే లేకపోయినట్లయితే కాలేజీ బ్యూటీగా చెలామణి అయివుండేది. అయితే ఆమె అపాఖ్యం తెచ్చుకోని అల్లరి అమ్మాయి.

ఆటపాటలంటే ఆమెకు అంతులేనంత ఆసక్తి. ఆటలు బాగా ఆడగలగటం వల్లనే ఆమె అమ్మాయిల్లో ఛాంపియన్ అయింది పాఠాలు వినకపోయినా మార్కులు బాగా వస్తూ వుంటాయి. ఆమె విద్యార్థినులలో లీడరు, అన్ని విషయాలలోనూ.

రాణి పాటలు బాగా పాడగలదు. సంగీతం అభ్యసించిందని చెప్పుకుంటూ వుంటారు. శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతం రెండూ జోడిస్తే రాగమూ, తాళమూ, లయా తప్పని ఒక క్రొత్త సృష్టి జరుగుతుంది అంటుంది. కోకిల కంఠం విప్పినట్టు, వన్నెల మయూరం లాగా పురి విప్పినట్టు, పూల సౌందర్యం లాగా కులుకుతూ ప్రవహించినట్లు, ఆమె పాడుతుంది నటరాజు ఆనందించేట్టుగా నృత్యం చేస్తుందిట! అయితే ఆమె

నృత్యం చేయటం ఎవరూ చూడలేదు. ఎప్పుడూ ఏ విచారమూ లేకుండా అల్లరి వల్ల ఆనందం పొందుతూ సంతోషంగా వుంటుంది రాణి.

*అంతరాంతర్యం :*

ఎక్స్‌పెర్‌మెంట్ నెంబర్ వన్ - పరిచయాలు.

అమ్మాయిల అనురాగాన్ని, అభిమానాన్ని సంపాదించాలీ అంటే అందుకు అనుగుణంగా అమ్మాయిలకు అత్యంత ఆదరణీయమూ, అభిలషణీయమూ అయిన పద్ధతులు అలవర్చుకోవటం విధి. రాణి అందానికి సాటిలేదు. ఈ విషయం చాలామందికి తెలుసు. అయితే చాలా కాలం అయిపోయిం తర్వాత అర్ధరాత్రి వేళ చదువుకుంటూ అకస్మాత్తుగా ఒక తీర్మానం చేశాడు రవి ఏకగ్రీవంగా, 'రాణి అందంగా వుంటుందీ' అని. రెండోరోజు కాలేజీలో చాలా ప్రయత్నంచేసి బలవత్తర పరిస్థితుల్లో చివరికి ఆమె వినేట్టుగా ప్రకటించాడు అమూల్యాభిప్రాయాన్ని. రాణి వింది. వెనక్కు చూచింది. నవ్వింది. రవి ఎగిరి పూలమీద దూకి జరజరా దొర్లిపోయాడు.

అప్పటినుంచి రాణికి ఒక విషయం తెలిసిపోయింది. తెలివితేటలు ఉన్నవాడూ, అందచందాలు కలిగిన వాడూ, అయిన రవికి తన సౌందర్యం తెలిసినందుకు అంతులేనంత ఆనందంలో మునిగి ఊపిరి ఆడక తన్నుకులాడింది.



"నాన్న జేబులో డబ్బులుతీసి వత్తులపెట్లో దాచావు కదమ్మా. అవి నేను తీసుకొని ఈ బొమ్మ కొనుక్కున్నాను."

అయితే అతను కనిపించినప్పుడల్లా అమ్మాయిలు అల్లకల్లోలంగా నవ్వుతూ వుండేవాళ్ళు 'గోలచేస్తున్నారా బాబూ ఇదెక్కడి గొడవ కొనినెత్తికి తెచ్చుకున్నాను' అని దిగులుపడేవాడు. రవి వంటరిగా కనిపించినప్పుడల్లా 'పుస్తకాల పురుగు' అంటూ వుండేది రాణి. కొంత కాలానికి అతను పుస్తకాలు బరువు బరువుగా మోయటం మానుకొని ఒక్క నోట్సుతో కాలేజీకి వస్తూవుండేవాడు. ఆడపిల్లలు ఎవరూ లేనప్పుడు లైబ్రరీకి పోయేవాడు పుస్తకాలు రూంకి తీసుకుపోయి చదువుకునేవాడు. ఇలా జరుగుతూ

వుంటే రాణి పుస్తకాల పురుగు అనటం మానుకుంది.

ఎక్స్‌పెరిమెంట్ నెంబర్ టూ - సాహస కృత్యాలు :

రాణికి సైకిల్ త్రొక్కటం అంటే ఇష్టం అని రవి తెలుసుకున్నాడు అప్పటి నుంచి ప్రయత్నాలు సాగించాడు. ఇంటికి ఉత్తరం రాసి డబ్బు తెప్పించి సైకిల్ కొని ఎక్స్‌పర్ట్‌ని దగ్గర పెట్టుకొని సైకిల్ నేర్చుకొనటం ప్రారంభించాడు. మూడు రోజులు నిర్విరామంగా ప్రయత్నం చేసి రోడ్డుమీదికి వచ్చాడు. తీరా రోడ్డుమీద జనాన్ని చూచి, కదిలిపోతున్న బళ్ళూ, కార్లూ, సైకిళ్ళూ చూచి, నిలువెల్ల నీరు గారిపోయి, మనిషంతా వణికిపోయి, కాళ్ళుచేతులూ ఆడక, చల్లబడి, నిదానంగా రోడ్డుమీద బోర్లాపడి లేచి సైకిల్ నడుపుకొని రూంకు వెళ్ళాడు.

సైకిల్ త్రొక్కటం తనవల్ల తేలదేమో నని ఒక అనుమానం చిన్న సైజులో కలిగింది. అందువల్ల ప్రయత్నం పెరిగింది. ఎప్పుడూ జనం వుండని పామ్ రోడ్డున తిరిగాడు ఆపైన బీచ్ రోడ్డున కొద్దిగా జనం వుండేచోట సైకిల్ నడిపాడు. ఆతర్వాత గవర్నరు బిల్డింగు ప్రాంతంలో తొక్కాడు ఇక కురుపాం మార్కెట్టు ప్రాంతంలో బాగా జనం ఉండేచోట విజయవంతంగా సైకిల్ అభ్యాసం పూర్తి చేశాడు. ఇక అప్పటినుంచి జనాన్ని తప్పుకోవటం, సమయానికి బెల్ కొట్టటం, సడన్‌గా బ్రేక్ వేయటం అతనికి ఇట్టే అలవాటయి పోవటంతో రోడ్డుమీద యధేచ్ఛగా తిరుగుతున్నాడు.

ఒక శుభ ముహూర్తం చూచి కాలేజీ లోకి సైకిల్ నడుపుతూ వచ్చాడు ఆ సమయంలో రాణీ ఆమె జట్టు వస్తున్నారు వాళ్ళు చూడటంకూడా జరుగుతుందని రవి ఆనందించాడు. అయితే సైకిల్ వెళ్లిపోవటానికి వాళ్ళే అడ్డంగా నడుస్తున్నారు ఏమిటి చేయటం ? బెల్ కొట్టాడు. వాళ్ళు తప్పుకోలేదు. వెను తిరిగి చూడలేదు. బ్రేకులు వేశాడు వాళ్ళు మరీ మెల్లగా నడుస్తున్నారు. సైకిల్ దిగి నడిపించుకొని పోదా మనుకున్నాడు. అయితే తను సైకిల్ త్రొక్కుతున్నట్టు రాణి ఎప్పుడు చూస్తుంది ? కాబట్టి సైకిల్ త్రొక్కాల్సిందే అనుకున్నాడు. వాళ్ళను తప్పించుకొని ముందుకు పోతే వాళ్ళు చూస్తారు. ఎలా అయితే ఏం ముందుకు పోయి నేను సైకిల్ త్రొక్కుతున్నాను చూడండహో అన్నట్టుగా వెనక్కు చూశాడు. అదే క్షణంలో అప్పటిదాకా లేకుండా అప్పుడే వచ్చిన సైకిల్‌ని గమనించలేక అమ్మాయిల వైపే చూస్తూ వస్తున్న యువకుడెవరో సైకిల్ దగ్గరగా వచ్చిందాకా రవి చూడలేదు సైకిల్ పడింది ఇద్దరూ పడ్డారు రవి పైకి లేస్తున్నప్పుడు అమ్మాయిల నవ్వులు పకపకా వినిపించాయి

రాణికూడా మెలికలు తిరుగుతూ నవ్వుతూ వెళుతూవుంది. రవి పరాభవం పొందాడు. ఎంతో ఆశించాడు ఇలా అయింది ఈ పరాభవానికి ఫైన్ వేసు కోవాలి చెంపదెబ్బ కొట్టుకోబోయి ఆగి, రూంకిపోయి, ఏడుస్తూ పర్సులో వున్న పైకంలోంచి పది రూపాయిల కాగితం ఫైల్లో పెట్టాడు.

ఛాంపియన్ రాణికి ట్రాక్ అండ్ ఫీల్డు ఈవెంట్స్‌లో రన్నింగ్ రేస్ అంటే చాలా ఇంటరెస్టు రవి రన్నింగు ప్రాక్టీస్ చేయాలని భావించాడు. గేమ్సుకి హాజరవుతూ వుండేవాడు ఫీల్డుకి వెళుతూ వుండేవాడు. పరుగెత్తటానికి అవసర మయిన మూమెంట్స్ పి.డి చేత నేర్పించుకున్నాడు వేగం రావటంలేదు కాని పద్ధతులు అలవడుతూ వున్నాయి కృషి సాగిస్తూ వున్నాడు.

ప్రాక్టీస్‌వల్ల ఫలితం వుందని గ్రహించాడు. బాగా ఆకలి అవుతూ వుంది. అన్నం చాలా ఎక్కువగా తింటున్నాడు ప్రైజ్ తీసుకోగలిగే స్థితి రావాలి మూడు నెలల తరువాత అతనూ ఒక ఎథలెట్‌గా చెలామణి అయిపోయాడు చాలా ప్రయిజులు వచ్చాయి ఈ మూడు నెలలలో బరువు చాలా పెరిగాడు ఎత్తు కూడ కొంచెం పెరిగాడు. అందంగా కూడా వుంటున్నాడని వాళ్ళూ వీళ్ళూ అంటున్నారు

అతని ప్రయత్నం నెరవేరి ప్రైజ్ తీసుకుంటున్నప్పుడు రాణి చూడలేదు సరికదా, ఆప్రాంతంలోనే లేదు. ఎంతో నిరాశ కలిగింది. నిస్పృహతో నిద్ర పోయాడు.

తెల్లవారింది. హోటల్లో రాణితో ఆమె క్లాసుమేటు రవి ప్రైజ్ విషయం చెబుతూవుంది దూరంనుంచి వాళ్ళకు కనిపించకుండా ఆనందంతో పొంగిపోతూ రవి వింటూ వున్నాడు. అయితే రాణి నాలుక చప్పరించింది జరిగిపోయిన సంగతి చెబుతూవుంటే రవి వినలేక పోయాడు. ఆమె ఇలా చెప్పింది.

"అప్పుడు రవి రన్నింగ్ రేస్ ప్రాక్టీస్ చేస్తున్నాడు కన్ను మూసినా తెరిచినా అదే ఆలోచన వస్తూవుండేది. ఒకరోజు రాత్రి రెండు గంటలదాకా చదువుకొని అకస్మాత్తుగా పరుగు అభ్యాసం గుర్తుకువచ్చి, రూంలోంచి బయలుదేరి రోడ్డుమీద పరుగెత్తటం ప్రారంభించాడు. కాపలా పోలీస్ అనుమానంతో విజిల్ వేశాడు. అయినా రవి ఆగకుండా ఏకబిగిని పరుగుపెడుతున్నాడు క్షణ క్షణానికి వేగం పెంచుతూ అప్పుడు ఇద్దరు పోలీసులు కలిసి అయ్యగారిని పట్టుకొని చక్కగా పోలీస్ స్టేషనుకు తీసుకుపోయి ఆ రాత్రంతా దోమలూ, నల్లులూ, ఉమ్ములూ, చీకటి మధ్య పోలీస్ స్టేషన్లో కష్టడీలో వుంచారు" అని ముగించింది అమ్మాయిలంతా

విపరీతంగా నవ్వారు సూదులుతో పొడిచి నట్లు బాధపడి లేచి రూంకిపోయి పర్సులో వున్న పైకంలోంచి పది రూపాయిల కాగితం తీసి ఫైల్లో పెట్టాడు

బట్టలు కట్టుకోవటంలో నేర్పువల్ల అందం రెట్టింపు అవుతుందని రాణి ఋజువు చేస్తుంది. తనుకూడా ఆ నేర్పు అలవర్చుకోవా లనుకున్నాడు రవి ముందువెనుకలు ప్రపోర్షనేట్‌గా షర్టు సద్దుకొని టక్ చేసుకోవటం రవికి తెలుసు. అప్పుడప్పుడూ అవసరమయిన అకేషన్స్‌లో కోటు వేసుకోవటం, టై గాని, బౌ గాని కట్టుకోవటం కుదురు తుంది. మునుపు ఒకసారి పైజమా వేసుకున్నాడు అయితే పంచె కట్టుకోవ టం తెలియదు ధోవతీ కట్టుకొని, లాల్చీ తొడుక్కుంటే చాలా బాగా వుంటుందని భావించాడు బజారుకి వెళ్ళి అంతా సిద్ధం చేసుకున్నాడు

ధోవతీ ధరించటం తెలిసిన స్నేహి తుడ్ని రూంకి తీసుకొనివచ్చి, నేర్పించు కున్నాడు. తరవాత స్వతంత్రంగా ప్రయత్నించాడు. పంచె నడుంమీద నిలవటంలేదు. అందువల్ల ముడి వేశాడు ముడి వూడి వూరుకుంటూంది అది కుదరటంలేదని బెల్టు బెట్టాడు అయితే పల్చని లాల్చీలోంచి బెల్టు కనబడుతూ వుంది. బెల్టు తీసి పంచె కొనలు మెలి పెట్టి నడుం పక్కనుంచి దోపి చూశాడు బిర్రుగా వుంది. వెరీగుడ్ అనుకున్నాడు. కాండో బనియన్ వెసుకున్నాడు. క్లాసు లోకి వెళ్ళాడు అమ్మాయిలు చూశారు రాణి సంతోషంగా నవ్వుకుంటూవుంది.

క్లాసు అయిపోయింది. అమ్మాయిల కంటే ముందు లేచి గబగబా వాళ్ళ ముందు నడచి వెళుతున్నాడు ముంజెంగు మోకాలిమీద అడ్డంతగులుతూ వుంది. ఆపైన బొటన వ్రేలిమీద జీరాడుతూ చెప్పుకి అడ్డం పడుతూవుంది తప్పుకొని నడుస్తున్నాడు. వెనుక రాణి జట్టు వుంది. ఉన్నట్టుండి దోవతి చెంగు బొటన వ్రేలుకి తగిలి గోచి వూడిపోయింది పంచె లుంగీ లాగా తయారయింది

రాణి కులికి కులికి నవ్వుతూవుంది. ఆ నవ్వు ప్రతిధ్వనించేంత పెద్దదిగా విన బడుతూవుంది. సంతోషం ఎగిరి పోయింది కోపం, దుఃఖం ముంచుకొని వచ్చింది. ప్రక్కరూంలోకి పోయి గోచి పెట్టుకున్నాడు పరాజయం పొందినంత బాధపడ్డాడు. ఏడుపు ముఖంతో రూంకి పోయాడు పర్సులో వున్న పైకంలోంచి పది రూపాయిల కాగితం తీసి ఫైల్లో పెట్టాడు

ఎక్స్‌పెర్‌మెంటు నెంబరు త్రీ - తంత్రజ్ఞత.

ఒకరోజు సాయంకాలం కాలేజీ అయి పోయిం తరవాత హాస్టలుకి వెళుతు న్నాడు రవి సైకిల్ ఎక్కి స్నేహితుడు వచ్చి తననికూడా తీసుకొని పొమ్మని అడిగాడు. అలాగేనని రవి ఒప్పుకు

న్నాడు. ఇద్దరూ సైకిల్ మీద వెళుతున్నారు. రోడ్డుమీద రాణీ ఆవిడ జట్టు నడుస్తున్నారు జల్సాగా ధీమాగా వెళుతున్నాడు రవి. రాణి చూచింది

'మిష్టర్ రవీ!' రాణి పిలిచింది

'ఏమిటీ?' అన్నాడు రవి సైకిల్ ఆపి

'ఇలారండి' అంది.

ఏదో మేలు జరుగబోతూందని రవి హుషారుగా స్నేహితుడికి సైకిల్ ఇచ్చి దగ్గరకు పోయాడు

'మీకు ట్రాఫిక్ రూల్సు తెలుసా?'

'ఏమి టవి?' ముఖం తెల్లబడింది రవి వళ్ళంతా చెమటపట్టింది బట్టలు తడిసిపోతున్నాయి అందుకు కారణం అమ్మాయి మాట్లాడటం ఒకటి భయంగా వుండటం రెండు చెప్పుతీసుకొని చెంప మీద కొట్టినట్లుగావుంది

అయినా వీరోచితంగా 'అయితే ఏం' అంటూ సైకిల్ ఎక్కబోయాడు

'పోలీసుని పిలవమంటారా' అంటూ ముందుకు చూచింది కార్నర్ లో పోలీసు వున్నాడు

రవికి మాటలు రాలేదు సైకిల్ ఎక్కలేదు ఇద్దరూ కలిసి నడక ప్రారంభించారు

రాణి జట్టు గొల్లుమని నవ్వింది

రవి అల్లాడిపోయాడు. నవ్వులు బాణాలలాగా వీపుకి తగులుతూ వున్నాయి



"ఇదిగో చూడు బ్రదర్, పరీక్ష పోతే పోయిందిలే విచారించకు. వచ్చే సంవత్సరం గెటాన్ కావచ్చులే."
"నే నందుకు విచారించటంలేదులేవోయ్. నేను, జలజ ఒకే క్లాసులో కూచునే ఉద్దేశ్యంతో ఫెయిలవుతే ఆ అమ్మాయికూడా ఫెయిలయింది ఖర్మ."

---

దిగులుతో రూంకి పోయి, పర్సులో వున్న పైకంలోంచి పది రూపాయల కాగితం తీసి ఫైల్లో పెట్టాడు

* * *

నాలుగు రోజులు గడచిపోయాయి

మ్యాట్నీ చూచి రాణీ, ఆవిడ స్నేహితురాలూ ఇద్దరూ ఒకే రిక్షా ఎక్కి వస్తున్నారు రవి చూశాడు

'మిస్ రాణీ' పిలిచాడు

'ఏమిటీ?' పలికింది

'మీకు ట్రాఫిక్ రూల్సు తెలుసా?' అడిగాడు రిక్షా ఆగింది

'తెలియదు' చెప్పింది

'ఇద్దరు వ్యక్తులు ఒక రిక్షా ఎక్క-కూడదు' చెప్పాడు

'అహఁ మహా చెప్పొచ్చారు ఆ రూల్ ఇంతకుముందు వుండేది ఇప్పుడదేమీ లేదు. పట్టణంలో జనభా పెరగటంతో ఆ రూలు మారింది. క్రొత్తరూలు అమలులోకి వచ్చింది. తెలియకపోతే తెలియనట్లు వూరుకోవాలి కాని తెలిసినట్లు చెప్పకూడదు. పాపం శ్రమపడ్డారు. వెళ్ళిరండి' అంది

రవి మాట్లాడలేకపోయాడు. అయినా ఎక్కువ సేపు మాట్లాడులేదు వెళుతున్నాడు.

'మిష్టర్ రవీ' రాణి పిలిచింది

'ఏమిటీ ?' అంటూ అటూ ఇటూ చూశాడు ఎక్కడ పోలీసులు లేరు

'ఇలా రండి' అంది.

'ఏమిటీ ?' దగ్గరకు పోయాడు

'క్రొత్త రూల్ ఏమీ లేదు. నువ్వు ఏదో చెప్పబోతూవుంటే అలా అన్నాను' జవాబు చెప్పింది

'అయితే దిగటం మంచివాళ్ళు చేసే పని' అలా మాట్లాడగలిగినందుకు ఎంతో సంతోషించాడు

'అదేం కుదరదు' అంటూ రిక్షా వాడితో 'పోనీయ్' అంది

'అయితే మంచివాళ్ళు కాదన్నమాట'

'కాదు' రాణి పకపకా నవ్వింది

రిక్షా మళ్ళీ ఆగింది

'మిష్టర్ రవీ' పిలిచింది

రవి పోలేదు.

రాణి దగ్గరగా వచ్చింది.

రవి వెళితే రాణి వచ్చేదికాదు రవి వెళ్ళలేదు కాబట్టి రాణి దగ్గరకు వచ్చింది. ఆడవాళ్ళ లక్షణమే అంత !

రిక్షావాడికి డబ్బులిచ్చి పంపింది.

'నీమీద జాలి తలచి రిక్షా దిగి నడిచి వెళుతున్నాం కాని నువ్వు ఏవో రూల్స్ చెప్పావని మాత్రం కాదు ' అంటూ రాణి వెళ్ళిపోయింది స్నేహితురాలితో, నవ్వుతూ

రవికి పుట్టెడు దుఃఖం వచ్చింది. చిరాగ్గా రూంలోకి పోయి వలవలా విలపించాడు. పర్సులోవున్న పైకంలోంచి పది రూపాయిల కాగితాలు రెండు తీసి పర్సులో పెట్టాడు

ఎక్స్‌పెరిమెంటు నెంబర్ ఫోర్ - దయాదాక్షిణ్యాలు:

రాణి కొక తమ్ముడున్నాడు. అతని పేరు మధు. ప్రీ యూనివర్సిటీ చదువుతున్నాడు. అతనికి ఆరోగ్యం బాగా లేకపోవటంవల్ల హాస్పటల్లో చేరాడు అతన్ని చూడటం కోసం రోజూ సాయంకాలం అక్కడికి వెళుతుంది రాణి. పరిచర్య చేస్తుంది. ఈ విషయం తెలుసుకున్నాడు రవి తక్షణం రూంకి వెళ్ళాడు

ఆరోగ్యంగా వున్న రవి ఆరోగ్యంగా వున్న రెండు ఉల్లిపాయల్ని చితకగొట్టి అనారోగ్యంగా చేసి అనారోగ్యంగా



వుండటానికి చంకల్లో పెట్టుకున్నాడు. అరగంట తిరక్కుముందే నూట నాలుగు డిగ్రీల జ్వరం వచ్చింది.

వెంటనే హాస్పటల్‌కి పోయి డాక్టరుతో మాట్లాడి, మధు బెడ్ ప్రక్కనే బెడ్ వేయించుకున్నాడు. సాయంకాలం అయింది. రాణి వచ్చింది. అప్పటికే రవి జ్వరం తగ్గిపోయింది. బెడ్డుమీదే వున్నాడు. రాణి రవిని చూచింది. చూడనట్లుగా వెళ్ళిపోయింది. మధు దగ్గరకు పోయింది కులాసాగా కబుర్లు చెప్పింది. రవికి చాలా ఆనందంగావుంది. వింటూ పడుకున్నాడు. తనని కూడ పలకరిస్తుందనీ, మందు తాగిస్తుందనీ, కబుర్లు చెబుతుందనీ ఏమేమో వూహించుకుంటూ పడుకున్నాడు.

రాణి డాక్టరు దగ్గరకు పోయింది. మధు ఆరోగ్యం విషయం కనుక్కుంది. తిరిగి వచ్చింది. ఆమె పునరాగమనం కోసం ఎదురుచూస్తూ రవి పడుకునే వున్నాడు. రవిని చూడలేదు. పలకరించలేదు. ఆగలేదు. ఏమీ గమనించనట్టు వెళ్ళిపోయింది. రవి ఆశలన్నీ నిరాశలయిపోయాయి. డాక్టరుతో తన జ్వరం తగ్గిందని చెప్పి, డిస్‌చార్జి చేయించుకొని రూంకి వెళ్ళి, వెక్కివెక్కి ఏడ్చి, నిద్రపోయి, మేలుకొని పర్సులోవున్న పైకం

లోంచి రెండు పదిరూపాయిల కాగితాలు తీసి ఫైల్లో పెట్టాడు.

*   *   *

ఏ వ్యాపకం లేకుండా నెలరోజులు చదివి రవి బాగా పరీక్షలు వ్రాశాడు. ముందుగా పరీక్షలు అయిపోయిన మధు ఇంటికి వెళ్ళిపోయాడు. ప్రాక్టికల్స్ పూర్తయిం తరవాత వేసవి శలవలకి విద్య పూర్తయిన రాణి బయలుదేరింది. ఆమె ఏ రైలుకి వెళుతుందో రవి తెలుసుకున్నాడు.

వెంటనే బజారుకిపోయి సవాశేరు పచ్చిమిరప కాయలు తెచ్చి, ఒక చక్కని జేబుగుడ్డలో అవి పోసి ఒక రాయి తీసుకొని నలగకొట్టి అది జేబులో పెట్టుకొని రైలు దగ్గరకు పోయాడు.

ఆమె రైలులో కూర్చుని వుంది. అటు వెళ్ళాడు. ఆమె చూడలేదు. దగ్గరకు పోయాడు. ఆమె గమనించలేదు. సూటిగా చూశాడు. ఆమె చూచింది. అయితే మాట్లాడలేదు. బండి కదలబోతూవుంది జేబుగుడ్డ తీసి కంటిపాపలకు తగిలేట్టుగా నులుంకున్నాడు. కళ్ళకు మిరపకాయల సారం పొగరు తగులుతూవుంది కళ్ళ వెంట నీళ్ళు తిరుగుతూ వున్నాయి.

'వెళుతున్నావా?' ప్రశ్నించాడు. కళ్ల వెంట నీళ్లు తిరగటం చూచింది కొంచెం కంకారుపడింది. ఆశ్చర్యపోయింది జాలి తలచింది

'అవును' అని వణుకుతున్న కంఠంతో బాధగా జవాబు చెప్పింది. కర్చీఫు కళ్ళకు తగలనిచ్చాడు. నీళ్ళు కారిపోతూ వున్నాయి. రైలు బైలుదేరింది. ఆమె ఒకసారి చూచి దీర్ఘంగా నిట్టూర్చి వూరుకుంది.

రైలు వెళ్ళిపోయింది. చేతిగుడ్డ అవసరం లేకుండానే రవి కళ్ళలోంచి జలపాతంలాగా వేగంగా కన్నీరు జలజలా రాలింది. రైలు వేగం పెరుగుతున్న కొద్దీ కన్నీరు వేగం పెరిగింది. తూలిపోతూ రూంకి వచ్చాడు. తల పగిలిపోతూ వుంది. పర్సులో వున్న పైకంలోంచి పది రూపాయిల కాగితాలు రెండు తీసి ఫైల్లో పెట్టాడు.

*ఉపసంహారం :*

రవిలో ఏదో నిర్వికల్పమైన స్థితి ఏర్పడింది. దుఃఖం అంతులేని కడలి లాగా అలలులేస్తూ వుంది గుండెలలో ఏదో కొండల బరువు పెరుగుతూవుంది.

ఫైల్లోవున్న పది రూపాయిల కాగితాలు పది అల్లరిచిల్లరగా అచ్చం రాణి లాగా గాలికి ఎరుగుతూ వున్నాయి.

లేడీస్ హాస్టలు గేటు కీపరు వచ్చి తలుపు తట్టి, పార్శిల్ ఇచ్చి రాణిమ్మ గారు ఇమ్మన్నారు అని చెప్పి వెళ్ళిపోయాడు

రవి గబగబా విప్పాడు ఒక ధోవతీ, ఒక లాల్చీ అందులో వున్నాయి. లోపల

ఒక కాగితం వుంది మడుపులతో. మడత విప్పగానే ఒక మల్లె మొగ్గ, మరొక్క ఉంగరం అందులో వున్నాయి ఆ కాగితంలో రాణి చేతివ్రాత స్పష్టంగా కనబడుతూవుంది.

ఉంగరం చాలా విలువైంది.

ఆ ఉత్తరంలో ఒకేఒక్క వాక్యవుంది. అదికూడా ఎంతో పెద్ద వాక్యం కాదు. రెండు మాటలు – 'మల్లెమొగ్గ జాగ్రత్త'.

అతనిలో విద్యుత్తు ప్రవహిస్తూవుంది. వెంటనే ఒక ఆలోచన వచ్చింది. ఫైల్లో వున్న పైకం తీసుకొని బజారుకి పోయి ఉంగరం కొని పోష్టాఫీసుకి పోయి పార్శిల్ చేయబోతూ ఆగి, రూంకి తిరిగి వచ్చాడు.

ధోవతి కట్టుకొని లాల్చీ వేసుకొని, ఉంగరం పెట్టుకొని, జేబుగుడ్డలో మల్లెమొగ్గ, క్రొత్త ఉంగరం జేబులో పెట్టుకొని గది తలుపుకి తాళం వేసి రోడ్డు మీదికి వచ్చాడు.

టాక్సీ తీసుకొని ఎక్కడికి పోవాలో చెప్పాడు. వంద మైళ్లు పోయింతరవాత ఒక జంక్షనులో రాణి ఎక్కి బయలుదేరిన రైలు ఆగివుండటం చూచి రవి టాక్సీ దిగి స్టేషను దాటి రైలు దగ్గరకుపోయి, కంపార్టుమెంటులోకి ఎక్కాడు.

రాణి చూచింది. ఆశ్చర్యపోయింది. నిలువెల్లా తిలకించింది. హాయిగా తల వంచుకొని నవ్వుకుంది.



"నమస్తే, నా పేరు సావిత్రండీ, మీరు..."
"సత్యవంతుణ్ణిలెండి."

రవి ఎదురుగా వున్న సీటులో కూర్చున్నాడు.

ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు. చాలాకాలం నిశ్శబ్దంగా గడచిపోయింది. ఒకరిపైపు ఒకరు చూచుకోలేకపోతున్నారు.

ఉన్నట్టుండి రవి రాణి చేయి పట్టుకున్నాడు. ఆమె భయంతో సంతోషంగా సిగ్గుపడింది.

తను కొని తెచ్చిన ఉంగరం ఆమె చేతికి తొడిగాడు. చక్కగా కుదిరింది.

మల్లెమొగ్గ తీసి జడలో తురిమాడు. ఆమె కళ్ళలోంచి జలజలా బాష్ప బిందువులు జారాయి.

రవి రెండు చేతులూ పట్టుకొని దోసిలి ఏర్పరచి తల దోసెట్లో వుంచింది. ఆమె నుదుట కుంకుమ అతని అరచేతికి తగిలి అక్కడున్న రేఖలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.



పైబెర్త్ మీద హోల్డాల్ పరచుకుని పడుకున్నాడు పత్రికా సంపాదకుడు త్రివిక్రమరావు. కింద సీట్లో కూర్చుని ఇద్దరువిద్యార్థులు మాట్లాడుకుంటున్నారు

"అరెరె!" అన్నాడు మరో విద్యార్థి చేతిలో వున్న వార్తాపత్రిక మరింత శ్రద్ధగా చదువుకుంటూ.

"ఎవరేనా చచ్చేరా?" అంటూ పరామర్శించే ధోకతను

"ఊఁ"

"మన కాలేజీకి కలవిస్తారా?" సాలోచనగా అడిగేడు మరొకతను

"అకోరా చచ్చిపోయాడురా, పాపం!"

"ఎవడా లసోర్కారా!"

"మంచి రచయితరా"

"పేరలాగుందే! కోకరా లాగ"

"అకోరా అంటే అలమండ కోదండ రామయ్య."

"గండపెండేరం లాగుంది పేరు. అ.కో రా. అదే బాగుంది సింపుల్‌గా"

"ఆత్మహత్య చేసుకున్నాడుట."

"కవి అన్నవాడు చస్తేనే కాని గొప్పవాడు కాలేడు. అంచేత త్వరగా పేరు ప్రతిష్టలు సంపాదించే మార్గం చూసుకున్నాడన్న మాట."

---

*బి. వి. రమణరావు*

---



"చాలా గొప్ప రచయితరా. అతను రాసిన పుస్తకాలు చదవలేదూ! 'రక్తాగ్ని' 'బంగారు పంజరం' 'మబ్బు తెరలు;' నిరుడు యూనివర్సిటీ నాటక పోటీలలో ఫస్ట్ ప్రయిజ్ వచ్చిన నాటకం "తీరని దాహం" ఇతను రాసిందే.''

"జాతస్య మరణం ధృవం అన్నారు. చచ్చినవాడి గొడ వెందుకు కాని 'పెళ్ళి పందిర' సినీమా గురించి రివ్యూ ఏం రాశాడో చదువు"

త్రివిక్రమరావుకు యీ మాటలు వింటూంటే హృదయం ముళ్ళ కంపతో కెలికినట్టయింది. అకోరా రాసిన మాటల్లో వున్న సత్యం కళ్ళముందరే కనబడింది. తనకి అకోరా రాసిన వుత్తరం మళ్ళీ తీసి చదవడం మొదలెట్టేడు.

ప్రియమైన తికమకరావు,

ఈ కొంటె పేరుతో నిన్ను సంబోధించడం ఇదే ఆఖరిసారి. ఈ వుత్తరం నీ కందేటప్పటికి నా శవానికి అంత్య క్రియలు కూడా అయిపోతాయి. నిన్న రాత్రే ఈ నిర్ణయాని కొచ్చేను. ఉదయమే నాకున్న పాత ట్రంకు, పడక కుర్చీ, బట్టలూ, పనికొస్తాయన్న నాకంటే దరిద్రుల కిచ్చేశాను. నువ్వు నా కథకి పారితోషికంగా పంపిన నూరు రూపాయలలోనూ అప్పులు పోగా ముప్పయి రూపాయిలు మిగిలేయి. అంత్య క్రియల నిమిత్తం పోలీసువాళ్ళ కది మిగిల్చేను.

నా మాటలు కర్కశంగానూ పైశాచికంగానూ కనబడుతున్నా యనుకుంటాను. ఆత్మహత్య చేసుకోడానికి నిర్ధారణ చేసుకున్నాక చావంటే భయం పోయింది అదీకాక నా జీవిత సమస్యల కింతకంటె పరిష్కార మార్గం కనబడలేదు.

దారిద్ర్యం, తీరని కోరికలూ, జీవితం వ్యర్థమనుకునే మానసిక ప్రవృత్తీ, వీటికి సాయం మూడు సంవత్సరాలుగా దిన దినాభివృద్ధి చెందుతున్న క్షయ రోగం — వీటన్నిటితో యిన్నాళ్ళూ శరీరం మీదుండే మమకారంతో పోరాడుతూ వచ్చేను. బాధపడతావని రోగం సంగతి నీకు చెప్పలేదు. ఇలాంటి నరకతుల్యమైన శరీర పంజరంలో బంధించి నా ప్రాణా న్నెంతకాలం బాధపెట్టమంటావు!

'పతితవ్రత' అనే నవల ఆరునెలల క్రితమే మొదలెట్టేను. దాన్ని ఎలా అంతం చెయ్యాలో ఇన్నాళ్ళూ తెలియలేదు. దానికికూడా నిన్ననే సమాధానం దొరికింది. నిన్ననే పూర్తిచేశాను. దాని వ్రాతప్రతీ, ఇంకా కొన్ని గేయాలూ కథలూ ఒక కట్టకట్టి వుంచేను. వాటిని నీ కిమ్మని పోలీసువాళ్ళకి వ్రాశాను.

జన్మజన్మాలకీ నీకు కృతజ్ఞుణ్ణి. నువ్వు తప్ప నన్నుగురించి బాధపడేవాళ్ళులేరు. నా రచనలు మెచ్చుకున్న పాఠకులు 'అరె! పాపం! పోయేడా!' అని కొంద రనుకుంటారు. 'కవి చస్తేకాని పైకి రాడు, కనక చావడమే మంచి'దని కొంద

నిజమే'' అన్నది. అనటమైతే అన్నది గాని తన మాటలు తనకే విచిత్రంగా ధ్వనించినై. ఇంతకుముందు యిటువంటి మాటలు ఆమె భర్తతో తప్ప ఎవరితోనూ అని ఎరుగదు.

"ఎంత మంచిమాట అన్నావు కళ్యాణీ. ఈ మాట నీ పెదిమల మీదుగా రావడంతో అతి మధురంగా వుంది. నన్ను విడిచి పెట్టి వుండటం నీకింత కష్టం అని తెలిస్తే నిన్నంటిపెట్టుకునే కూర్చునే వాణ్ణి. ఆఫీసుకి వెళ్ళేవాణ్ణే కాదు" అన్నాడు జయరామారావు, ఆపుకోలేని ఉత్సాహంతో.

"సరేలెండి, మీరు వెళ్ళి డ్రస్సు మార్చుకు రండి — సినీమాకు టైమవుతోంది" అంది సుందరి.

''ఒక్క క్షణంలో ఒస్తాను కళ్యాణీ! ఈ క్షణం నేను నిన్ను విడిచిపెడుతున్నందుకు నువ్వు నన్ను క్షమించాలి.'' అని అతను లోపలకు వెళ్ళబోయేటప్పటికి వీధిద్వారం దగ్గరున్న కుక్క ''భౌ భౌ'' మని అరిచింది. 'ఎవరు?' అన్నట్టు జయరామారావు వెనుదిరిగి సుందరివైపుకి చూపులను ప్రసరించాడు.

''సినిమాకు కలిసి వెళ్దామనే ఉద్దేశంతో సదానంద్‌ని రమ్మని ఫోన్ చేశాను. అతనొచ్చి వుంటాడు'' అన్నది సుందరి.

''ఓ! అలాగా, మంచిపని చేశావు. అతను కూడా వుండటం మరీమంచిది. నిజానికి అతన్ని పిలవమని నేనూ చెబుదామనుకున్నాను గాని నీతో అనటం మర్చేపోయాను సుందరీ!" అన్నాడు జయరామారావు.

''మీ మనసిక్కడ వుంటేగా!" అని చిలిపిగా నవ్వింది సుందరి.

"ఇక్కడే వుంది.''

''కాని మరొక భావంతో నిండి వుంది" అని బిగ్గరగా నవ్వింది సుందరి.

"ఏమిటా భావం?" అనడిగాడు జయరామారావు.

"......'భావం' అనటం కంటె 'మనిషి' అని అనవలసింది" అని అంది సుందరి, ఏమీ తోచక చీరఅంచును మునివేళ్ళతో నలుపుతున్న కళ్యాణిని పర్యావలోకిస్తూ.

సుందరి అభిప్రాయం జయరామారావుకి మొదటినుంచీ తెలుసు. ఈ నాటకం వారు యింతకుముందు అనేకసార్లు ఆడినదే. కాని కళ్యాణికి వినిపించాలనే ఉద్దేశంతో. ''ఎవరా మనిషి?" అనడిగాడు.

"కళ్యాణి..." అని మత్తుగా, ఏదో రహస్యం ఊదుతూ ఉన్నట్టుగా సమాధానం చెప్పింది సుందరి.

ఈ సమాధానానికి అటూ ఇటూ నడుస్తూ, మధ్య మధ్య ఆగుతూ, "నిజమే సుందరీ! నువ్వు చెప్పింది అక్షరాల నిజం. కళ్యాణి ఈ యింట్లో అడుగు పెట్టినప్పటినుంచీ నా మనస్సులోకి

యింకొక ఆలోచన చొరటంలేదు. నా కంటికి ఇంకొక వస్తువు కనిపించటం లేదు. ఈవాళ ఆఫీసులో ఏపనీ చేయ బుద్ధి కాలేదు. పట్టు బలవంతాన ఒకఫైలు తీసుకుని, దానిమీద నా అభిప్రాయం రాద్దామనుకుని, అభిప్రాయానికి బదులు ఒక ప్రేమగీతం వ్రాశాను.''

పెగిలి వస్తున్న నవ్వును చేతి రుమాలుతో ఆపుకుంటూ, "ఏ భాషలో ?'' అనడిగింది సుందరి.

''ఇంగ్లీషులో''

"తెలుగులో నేమోనని భయపడ్డాను" అని విరగబడి నవ్వింది సుందరి. ఆ నవ్వు సదానంద్ ఒస్తున్నాడనే ఆనందాన్ని ఆపుకోలేక నవ్విన నవ్వని జయరామారావు కూడా తెలుసుకోలేనంత స్వభావ సిద్ధంగావుంది.

సుందరి నవ్వుతూనే, ''చూడు కళ్యాణీ! ఈయనకు తెలుగులో రాయటం చేతకానేకాదు. ఒత్తులు లేని చోట ఒత్తులు పెట్టటంలో, ఉన్నచోట విడిచిపెట్టటంలో వీరు నిధి! అందుకని ఆయన వ్రాసిన ప్రేమగీతం తెలుగులో వ్రాశారేమోనని భయపడ్డాను" అన్నది.

"లేదు—లేదు. ఆ తప్పు చేయలేదు. ఇంగ్లీషులోనే వ్రాశాను."

"బ్రతికించారు"

"ఎవర్ని గురించని అడగవేం?''

''అమాత్రం ఊహించలేనా? కళ్యాణిని గురించి వ్రాసుంటారు ?" అన్నది.



"నీకు నీ భార్యను కొట్టాలన్న అభిప్రాయం ఎందుకు కలిగింది ?"

"ఒకటి: ఆవిడ వీపు నావైపు ఉంది. రెండు కర్ర నాచేతిలో ఉంది. మూడు: దొడ్డితలుపు తీసిఉంది పారిపోవటానికి వీలుగా. ఇంకే కావాలి చెప్పండి."

---

కళ్యాణి చేతుల్ని తనచేతుల్లోకి తీసుకుని నవరిస్తూ. ఆ చెయ్యి వేడెక్కి వుండటం సుందరి గమనించకపోలేదు.

కళ్యాణి ఏదో మాట్లాడబోయింది. ఆమె పెదవులు ఒణికినవి. అంతలోకి సదానంద్ గదిలోకి ఒచ్చాడు. గడపలో నిలబడి, ''నేను రావచ్చా ?" అనడిగాడు. కళ్యాణి తలపైకెత్తి చూసింది. సదానంద్ ఎర్రగా, బక్కపలచగా వున్నాడు; లాల్చీ తొడుక్కుని పైజామా వేసుకున్నాడు. వయస్సుకి ముప్ఫయ్ సంవత్సరాలున్నా ముఖం చాలా లేతగా వుంది. తనున్న పరిస్థితుల్లో అతను రావటంవల్ల ఆపదలో ఉన్నప్పుడు

ఆపద్బంధువును చూసినట్లనిపించింది కళ్యాణికి.

అతన్ని చూసీ చూడగానే "కమాన్ సదానంద్? నీకోసమే నిరీక్షిస్తున్నాం" అని ఎదురుగావెళ్ళి, అతని చెయ్యి పట్టుకు తీసుకునివచ్చి, కూర్చోపెట్టాడు జయరామారావు. కళ్యాణిని పరిచయం చేశాడు.

సదానంద్ కలుపుగోలు మనిషికాదు. బెరుకు బెరుకుగా వచ్చి కూర్చున్నాడు. జయరామారావు కళ్యాణిని పరిచయం చేస్తూవుంటే, తలవంచుకు కూర్చుని, 'చాలా సంతోషం' అన్నాడు సదానంద్.

అతన్ని చూసి ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది కళ్యాణి. అతని రాకతో తను పడుతున్న యిబ్బందంతా తొలగి పోతున్నట్లు భావించింది. ఒక్కసారి అతన్ని నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూసింది. అతని వ్రేళ్ళు తడబడుతూండటం గమనించింది. తనకు తెలియకుండానే కాలూపుతూ కూర్చున్నాడు.

"కొత్త వారితో సదానంద్‌గారు తొందరగా పరిచయం చేసుకోలేరు కళ్యాణీ! అందుకు వారిని నువ్వు క్షమించాలి" అన్నది సుందరి. వెంటనే సదానంద్ వేపు తిరిగి, "కళ్యాణి కూడా ఒక విధంగా మీ వంటిదేనండీ" అని కలిపింది. సదానంద్ పెదవుల మీద చిరునవ్వు వెలిసింది. అదికూడా లీలగా మాత్రమే.

ఈ విధంగా పరిచయం చేయటం జయరామారావుకి నచ్చలేదు. సంభాషణ మార్చుదామనే ఉద్దేశంతో "మేం సినిమాకు వెళ్దామను కుంటున్నాము సదానంద్" అని అన్నాడు.

"సుందరి చెప్పింది" అన్నాడు సదానంద్ క్లుప్తంగా.

"మీరు మాట్లాడుతూ వుండండి. నేను డ్రస్ మార్చుకొస్తాను." అని చెప్పి, లోపలికి వెళ్లాడు జయరామారావు.

అంతలోకి వంటవాడు మూడు కప్పులతో కాఫీ తీసుకొచ్చి, ముగ్గురి ముందూ వుంచాడు.

"నా కొద్దక్కా" అన్నది కళ్యాణి.

"ఎందుకని?"

"ఈ టైమ్‌లో నేను కాఫీ త్రాగను."

"ఫర్వాలేదు – త్రాగండి" అన్నాడు సదానంద్.

సదానంద్ మాట వినబుద్ధయింది కళ్యాణికి. ముగ్గురూ కాఫీ త్రాగటం మొదలు పెట్టారు.

సదానంద్‌ది తూర్పుగోదావరి జిల్లా. మొదట్లో మద్రాసులో సినీమాలలో డ్యాన్సు డైరెక్టరుగా పనిచేస్తూ వుండేవాడు. ప్రస్తుతం ప్రభుత్వం స్థాపించిన సంగీత నాటక విద్యాలయంలో అధ్యాపకుడుగా వుంటున్నాడు. ఐనప్పటికీ సినీమాలపట్ల కుతూహలం ఇప్పటికీ తగ్గలేదు. అతని విద్యాలయం సుందరి

పనిచేసే ఆఫీసుకి దగ్గరగా వుంది. అతని యిల్లుకూడా అక్కడే. అతనికొక భార్య, ఇద్దరాడపిల్లలు ఉన్నారు. అతని భార్యను చూసే నిమిత్తం సుందరి అతనింటికి పలుమార్లు వెళ్ళింది. అతని భార్య పాత కాలపు మనిషి మొదట్లో సుందరి తన మీద యిష్టం కొద్దీ వస్తూందని నమ్మి అమిత గౌరవం, మర్యాదా చూపింది. తరువాత సుందరి స్వభావం కనిపెట్టి పోట్లాట పెట్టుకుంది; తన యింటికి రావద్దన్నది. సుందరి సదానందుని ఎంత ప్రేమిస్తూన్నా ఈ పుండు మాత్రం ఆమె మనస్సును నిరంతరం కెలుకుతూనే వుంది.

"సరాసరి ఆఫీసునుంచే వొచ్చావా?" అని అడిగింది సుందరి, సదానంద్‌ని.

"అవును." అన్నాడు సదానంద్.

"ఇంటికివెళ్తే—రావటమనేది ఉండేది కాదనుకుంటాను" అన్నది సుందరి.

"ఎందుకు రాను?"

"ఆమెగారు రానిచ్చేదా?" అని ప్రశ్నించింది సుందరి, సదానంద్ భార్య నుద్దేశించి.

"ఎందుకు రానిచ్చేది కాదు? నేను సినిమాకు వెళ్తానంటే ఆమె వద్దం టుందా?" అన్నాడు సదానంద్.

"నాతో వెళ్తున్నానని చెప్పి రాగలవా?"

"ఆ మాట చెప్పి, ఆమె మనస్సుని ఎందుకు కష్టపెట్టాలి?" అనడిగాడు సదానంద్.

సదానంద్‌కి సుందరంటే అమితమైన ప్రేమ. అందులో సందేహం లేదు. కాని తన భార్య ఉత్తమ యిల్లాలనే దృఢ విశ్వాసం కూడా వుంది. అందువల్ల వీలైనంతవరకు ఆమె మనస్సుని కష్ట పెట్టకుండా ఉండాలని ప్రయత్నించేవాడు. ఎప్పుడైనా సుందరి ఆమెను హేళన చేసినా — సహించి ఊరుకునేవాడే, గాని ప్రోత్సహించేవాడు కాదు. అతని ఈ గుణానికి ఒక్కొక్కప్పుడు సుందరికి చెడ్డ కోపం వచ్చేది.

"నీ భార్య మీద నీకింత ప్రేమ ఉన్నప్పుడు జయరామారావుగారికి నా మీదకూడా ఉండవలసిందే కదా..." అని అడిగేది.

"ఉండవలసిందే..." అనేవాడు సదానంద్.

"నీ భార్య నిన్నెవరితోనూ మాట్లాడ నివ్వకుండా పట్టుకు కూర్చున్నప్పుడు నేను జయరామారావుగారిని పట్టుకు కూర్చోవలసిందేగా" అని అడిగేది.

"అలా చేయడం తప్పని ఎవరూ అనలేరు" అని అనేవాడు సదానంద్.

"నీతో చనువుగా వుండేవాళ్ళందరినీ నీ భార్య అనుమానించినట్లు జయరామా రావుగారితో చనువుగా వున్న వాళ్ళంద

రినీ నేను అనుమాంచ వలసిందేగా?" అని అడిగేది.

"అది ఒక్కొక్కరి స్వభావాన్నిబట్టి వుంటుంది..." అనేవాడు సదానంద్.

మరీ కోపం ఒచ్చేటప్పుడు "భార్యను ఇంట్లోనుంచి బైటకు తీసుకురాని, నీకు, ఇతరుల భార్యలతో సరసాలాడే హక్కు గాని, మాట్లాడే హక్కుగాని ఎక్కడుంది. అనడిగేది.

అటువంటి సమయాల్లో మెదల క్ష్ణా ఊరుకునేవాడు సదానంద్.

ఈ మౌనం సుందరి మనస్సుని చాలా చీకాకు పర్చేది. అయినప్పటికీ అతన్ని వొదులుకుని ఉండగలిగేది కాదు. ఒకటి రెండు రోజులు అతను కనుపించకపోతే తనే అతని విద్యాలయానికి వెళ్ళి, తీసుకొచ్చేది; బుజ్జగించి లాలించేది; దారికి తెచ్చేది.

సదానంద్‌తో పరిచయమైన తరువాత సుందరి పలుమార్లు అతని యింటికి వెళ్ళటానికి అతని భార్యను చూడాలనే కుతూహలమే కాక—మరొక పెద్ద కారణం కూడా వుంది. తాను ప్రేమించిన భర్తల భార్యలతో స్నేహం చేయటం ఆమెకు రివాజు. అలా స్నేహం చేయటంవల్ల వాళ్ళు తనను అనుమానించకపోవటమే కాక ఇతరులు కూడా ఏమీ అనుకోరని ఆమె అభిప్రాయం. ఈ ఉద్దేశంతోనే మొట్ట మొదటలో సదానంద్ భార్యతో స్నేహం చేయటానికి ప్రయత్నించింది. తన ప్లాను పారకపోయేటప్పటికి ఆమె మీద విపరీతమైన ద్వేషం పెంచుకుంది. మాటలమీద ఆమె తన ప్లాను గ్రహించిందని తెలుసుకుని మరీ దహించుకుపోయింది.

ఆ క్షణం ఈ విషయాలన్నీ జ్ఞాపకం వచ్చి, ఆలోచిస్తూ కూర్చుంది సుందరి. ఏమీతోచక సిగరెట్టుతీసి వెలిగించాడు సదానంద్.

"డాక్టరు తాగవద్దన్నాడు కదా..."

"వాళ్ళకేం—వాళ్ళెన్నన్నా చెబుతారు" అన్నాడు సదానంద్.

"ఆమెగా రిన్ని కబుర్లు చెబుతారుగా ని—నీ చే సిగరెట్లు మాన్పించలేకపోయింది" అన్నది సుందరి, కాస్త నిష్టూరంగా.

సదానంద్ మాట్లాడకుండా కూర్చున్నాడు. మౌనం వహించాడు.

సుందరి అకస్మాత్తుగా కళ్యాణివైపుకి తిరిగి ''ఈయనగారు పైకి సవ్యభావాలు కలవారుగా కనిపిస్తారుగాని, అసలు భార్య మాట జవదాటని చాదస్తులు కళ్యాణీ'' అని అన్నది.

''మంచిదేగా అక్కా...'' అన్నది కళ్యాణి అమాయకంగా

"ఇంకేం సదానంద్! నీకువత్తాస్ పలకటానికి యింకొక ఆమె దొరికింది. నువ్వు చాలా అదృష్టవంతుడివి సుమా.." అన్నది సుందరి.

సదానంద్ కృతజ్ఞతా సూచకంగా కళ్యాణివైపుకి చూపులను మరల్చాడు. వారి చూపులు కలిశాయి. ఒకరి నొకరు క్షణంలో అర్థం చేసుకున్నట్లనిపించింది వాళ్ళకి.

జయరామారావు డ్రస్సు మార్చి, గబగబా వాళ్ళ దగ్గరికొచ్చాడు. "ఫోన్ జేసి, సీట్లు రిజర్వు చేశాను సుందరీ—వాకిట్లో కారు రెడీగా వుంది—బయల్దేర దామా?'' అనడిగాడు.

''అలాగే'' అంది సుందరి.

* * *

వారంతా సత్యజిత్‌రాయ్ చిత్రం చూడటానికి బయల్దేరారు. మన దేశ చలనచిత్రరంగంలో ప్రతిభ, వ్యక్తిత్వం గల డైరెక్టర్లు ముగ్గురున్నారు—శాంతారాం, సత్యజిత్‌రాయ్, కిశోర్ సాహు. సత్యజిత్ రాయ్ చిత్రాలు తీసే విధానాన్ని బట్టి జీవితానికి చాలా దగ్గర్లో ఉన్నాయని కనిపిస్తుంది, వాటిల్లో మనస్తత్వ పరిశీలన ఎక్కువగా వుంటుంది. అందువల్ల మిగిలిన చిత్రాల కంటే నడక మందకొడిగా వుంటుంది. అయితే కథను స్త్రీ జీవితంలోవున్న స్వభావసిద్ధతను చెడకుండా చేయటంలో ఆయన అఖండుడు ; అసమానుడు. తన చిత్రాలలో ఆయన అనుసరించే విధానం కథా గమనంలో మిళితమై వుంటుంది. శాంతారామ్ ప్రతిభవేరు. కథను నడిపించటంలో ఆయన అనుసరించే



''ఒరేయ్ రావ్, ఎన్నాళ్ళయిందిరా నిన్ను చూసి ! మూడు పెళ్ళిళ్ళు చేసుకున్నావట నిజమేనా ?"

"నిజమే ! మొదటి భార్య చాలా మంచిది. దాన్ని దేవుడు తీసుకెళ్ళాడు. రెండవది వట్టి దుర్మార్గురాలు. భూతమే దాన్ని మింగేసింది. ఇక మూడవది ఉంది చూశావ్, అది అంత మంచిదీకాదు, అంత చెడ్డదీకాదు. అందుకే దాన్ని నేను భరించాల్సివచ్చింది."

---

విధానం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఒక పెద్ద ఉప్పెనగాలి కథను చుట్టుముట్టి అతివేగంగానూ, అత్యంత బలంతోనూ క్లైమాక్సుకి తీసుకుపోతున్నట్లు అనిపిస్తుంది. అతను ఏ చిత్రంలోనైనా మనస్తత్వ పరిశీలన చేసినా అందులో సైతం చేప్పే విధానమే ప్రాధాన్యత వహిస్తుంది. కిశోర్‌సాహూది మధ్యేమార్గం. కథలోవున్న స్వాభావికతను అతను వదలడు. కానీ చెప్పే విధానంలో సాంకేతిక ప్రతిభను చూపే అవకాశం ఉన్నప్పుడు ఆ స్వాభావి

కతను కొంతవరకు సర్దటానికి వెను దీయడు.

ఈ ముగ్గురి చిత్రాలూ ఆనాడు హైదారాబాదులో ప్రదర్శింపబడుతూ వున్నై. సత్యజిత్ రాయ్ చిత్రం అంటే జయరామారావుకి బొత్తిగా యిష్టంలేదు. శాంతారామ్ చిత్రం అంతకుముందే చూశాడు. అందుకని అతను కిశోర్ సాహూ చిత్రానికి టిక్కట్లు రిజర్వు చేశాడు. అలా రిజర్వు చేయటానికి మరొక కారణం కూడా లేకపోలేదు. ఆ మూడు చిత్రాలలోనూ మీనాకుమారి నటిస్తున్నది కిశోర్‌సాహూ డైరెక్టు చేసిన చిత్రంలోనే.

ఈ విషయం తెలిసి కొంచెం ఆశాభంగం చెందాడు సదానంద్. అతనికి సత్యజిత్ రాయ్ చిత్రాలంటే యిష్టం. అతను మనసు కనిపెట్టి, "మనం ఏమనుకుంటే ఏంప్రయోజనం సదానంద్ ! కిశోర్‌సాహూ చిత్రంలో మీనాకుమారి వుంది — మిగిలిన వాటిల్లో లేదు.'' అన్నది సుందరి.

ఆ మాటకు ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు జయరామారావు. కళ్యాణి వైపుకి తిరిగి, ''నీకు మీనాకుమారంటే యిష్టమేనా ?'' అనడిగాడు.

ఈ ప్రశ్నకు కళ్యాణి తబ్బిబ్బుపడింది. కళ్యాణి నూజివీడులో అప్పుడప్పుడు సినీమాలు చూస్తూవుండేది అన్నమాట నిజమే. కాని ఆమెకు పాత్రధారులపేర్లు జ్ఞాపకం ఉండేవి కాదు. కథానాయికలందరూ ఒక రకంగానూ, నాయకులందరూ ఒక రకంగానూ ఉండేవారు. ఆమెకు కథ బాగోగులు తప్ప నటనలో ఉన్న హెచ్చుతగ్గులు తెలిసేది కాదు. మీనాకుమారి నటించిన కొన్ని చిత్రాలను ఆమె చూచి ఉండవచ్చును. కానీ మీనాకుమారి ఎవరో ఆమెకు తెలియదు. అందువల్ల జయరామారావు ప్రశ్నకు ఏమి సమాధానం చెప్పాలో తెలీక మెదలకుండా ఊరుకుంది. వారు ప్రయాణంచేస్తూన్న కారుకిటికీలోనుంచి బైటకుచూస్తూ కూర్చుంది.

"నిన్నే కళ్యాణీ...'' అన్నాడు జయరామారావు.

''ఆమెను అంత తరిచి అడగటం ఎందుకు ? ఆ మాత్రం మనం ఊహించలేమా—ఏమిటి ? కళ్యాణికి మీనాకుమారంటే అసూయ...'' అన్నది సుందరి.

''అసూయెందుకు?" అని ఆశ్చర్యంగా అడిగాడు జయరామారావు.

"ఆమె తనలాంటిదే నని..."

కారు నడుపుతున్న జయరామారావు "బాగా అన్నావు సుందరీ" అని బిగ్గరగా నవ్వాడు.

"మలుపొస్తూంది కారు జాగ్రత్తగా నడపండి'' అని వార్నింగిచ్చాడు సదానంద్.

"వారిప్పుడు మహదానందంలో ఉన్నారు—ఏక్సిడెంటు జరిపినా జర పొచ్చు" అన్నది సుందరి.

"అందుకు మన పర్మిషన్ తీసుకో వాలి..." అన్నాడు సదానంద్ లీలగా నవ్వుతూ.

"ఆయనకిప్పుడే పర్మిషనూ అక్కరలేదు," అని కాసేపాగి, కళ్యాణి వైపుకి తిరిగి "అంతేనా కళ్యాణీ?" అనడిగింది, సుందరి.

"ఇటువంటి మాట లనకక్కా. తథాస్తు దేవతలు పైనవుండి మనం మాట్లాడిన ప్రతి మాటకూ 'తథాస్తు, తథాస్తు' అంటూ వుంటారట..." అని అన్నది కళ్యాణి.

కళ్యాణి అమాయకత్వానికి అందరూ నవ్వుకున్నారు. అందరిలోకీ ఎక్కువ నవ్వింది జయరామారావు.

కారు సినిమాహాల్ దగ్గరకి చేరింది. కారు పార్కు చేసి, గబగబవెళ్ళిటిక్కెట్లు తీసుకొచ్చాడు జయరామారావు. టిక్కెట్లకు తాను డబ్బు యిద్దామను కుంది కళ్యాణి. వాళ్ళయింట్లో ఉచితంగా భోజనం చేయటమేకాక ఆయనచేత సినిమాకు కూడా ఖర్చు పెట్టించడం ఆమెకు ఇష్టం లేక పోయింది. కానీ ఎలా యివ్వాలో అర్థం కాలేదు. యివ్వటమనేది వస్తే అందరికీ ఇవ్వటం మంచిదనుకుంది. మరుక్షణం తన టిక్కెట్టుకైనా యిద్దామనుకుంది. కానీ



"నేను నాకు ఒక బెనారెస్ చీరె, పిల్లలిద్దరికి చెరి రెండు జతల బట్టలు కొందామను కుంటున్నా. మీ రేమనుకుంటున్నారూ?"
"నేను ఈ ఇంట్లోనుంచి పారిపోదామను కుంటున్నా."

---

హైదరాబాదులో టిక్కెట్టు ఖరీదెంతుం టుందో, అసలు జయరామారావుగారు ఏ క్లాసు టిక్కెట్టు రిజర్వు చేయించారో ఎంత డబ్బివ్వాలో ఆమెకు అంతు పట్ట లేదు. పైగా డబ్బు హ్యాండ్ బ్యాగ్‌లో పెట్టుకుని తీసుకొచ్చే అలవాటు లేదు. యథాప్రకారం చెంగున ముడి వేసి తెచ్చింది. అంతమందిలోను చెంగు ముడి విప్పటానికి ఆమె సిగ్గుపడింది. ఇన్ని సమస్యలతో ఆమె సతమత మవుతూఉండగా జయరామారావు వెళ్ళటం, టిక్కెట్లు తీసుకురావటం జరిగింది.

"రండీ, న్యూస్ రీలు మొదలు పెట్టారు" అన్నాడు జయరామారావు.

అంతా తనను అనుసరించారు. కళ్యాణి తాను టిక్కెట్లకు డబ్బివ్వ

నందుకు ఎవరేమనుకుంటున్నారో—అని బిడియపడుతూ అడుగులో అడుగు వేసుకుంటూ, భూమిలోకి చూస్తూ తొట్రుపాటుతో నడిచింది. ఆ వాతావరణంలో ఆమె కాలిమట్టెలు టక్ టక్ మని మోగటం ఆమె మనసును బాధపెట్టి, మనిషిని విపరీతంగా కృంగదీసింది.

నూజివీడులో అయితే అలా మట్టెలు మోగటం మొగవాళ్ళ కాళ్ళ బూట్లు చప్పుచేసినట్టు చాలా ఫ్యాషన్‌గా పరిగణింపబడేది. ఇప్పు డాధ్వని తనకే ఎబ్బెట్టుగా తోచింది కళ్యాణికి. ఆ ధ్వని వినబడకుండా వుండగలందులకు కాలి వేళ్ళు బిగబట్టి నడిచింది. అది అవటానికి చిన్నహాలే అయినా హైదరాబాదులో ఉన్న నవనాగరికులందరూ అక్కడి చిత్రాలు చూడ్డానికి వస్తూంటారు. దానికి కారణం అక్కడికి మంచి చిత్రాలు రావటమే కాక స్త్రీ పురుషులు గంటలు గంటలుగా ఆట్టే రద్దీలేకుండా ఒకరి కొకరు కనబడకుండా కూర్చునే అవకాశం వుంది. ఆ హాల్లో పై తరగతుల వాళ్ళు కూర్చునే సీట్లన్నీ పై అంతస్తులోనే ఏర్పాటుచేయబడి వుంటాయి. జయరామారావు మిగిలిన వాళ్ళందరినీ మెట్లెక్కించి అక్కడికి తీసుకెళ్లాడు. మెట్లెక్కేముందు ఆ హాల్లో చాలామంది స్త్రీ పురుషులు చిత్ర విచిత్రమైన వేషధారణతో వుండటం కళ్యాణి గమనించింది. పురుషులలో ఎక్కువమంది రకరకాల సూట్లు ధరించి వున్నారు. వారి వేషధారణలో ఆట్టే భేదంలేదు. జుట్టు దువ్వుకోవటంలో, మీసాలు కత్తిరింపుల్లో నెక్‌టైలకు వాడిన గుడ్డల్లో ఉన్న చిన్నచిన్న భేదాలుతప్ప మొత్తం అందరూ ఒకే మాదిరిగా కనిపించారు కళ్యాణికి. కాని స్త్రీల వేషధారణతోనూ, యితర అలంకరణలలోనూ ఆమెకు చాలా పెద్ద పెద్ద మార్పులు కనిపించాయి. ఒక్క జుట్టు దువ్వుకోవటంలో ఒకదానికొకటి పొంతనలేని అనేక మార్పులు కనిపించినై. జుట్టు దువ్వుకోవటంలో ఒంటిజడ వేసుకోవటం రెండుజడలు వేసుకోవటం, చుట్టుముడి వేసుకోవటం మాత్రమే ఆమె నూజివీడులో చూసింది. ఇక్కడలా కాదు. ఒక్కొక్క స్త్రీది ఒక్కొక్క రకం. ఎంతమంది స్త్రీలున్నారో అన్నివిధానాలు ఆమెకు గోచరించినవి. ఎక్కువమంది స్త్రీల జాకెట్లు భుజాలవరకే ఉండటం ఆమె గమనించింది. మిగిలిన చేతులు నగ్నంగా వున్నాయి. అలా వుంచుకోవటం ఆమె మనస్సును గిలిగింతలు పెట్టింది. నగ్నంగా వున్న ఆ చేతుల్ని చూడలేక ముఖాన్ని అవతలవైపుకి తిప్పుకుంది. ఇక్కడ స్త్రీలు ధరించిన జాకెట్ల మెడలు కూడా ఆమెకు సోద్యంగానే కనిపించినై. మెడకింది వీపు కనిపించేటట్టు, కంఠంకింది వక్షస్థలం కనిపించేటట్టు అతి నాజూకుగా కత్తిరించబడి

వున్నాయి. పైగా వారు ధరించిన బట్టలు సన్నవీ, సున్నితమైనవీనూ. నూజీవీడులో స్త్రీలు శరీరాన్ని దాచుకోవటం అందమనీ, ఇక్కడ శరీరాలు ప్రదర్శించడం అందమనీ ఆమె చిటికెలో కనిపెట్టింది.

నూజివీడులో భార్యాభర్తలు కలిసి సినిమాకొచ్చినా టిక్కట్లు కొన్నతరువాత చీలిపోయి ఒకరు పురుషుల కుద్దేశించిన స్థలంలోనూ, రెండవవారు స్త్రీలకు నిర్దేశించిన స్థలంలోనూ కూర్చునేవారు. ఒకవేళ కలిసి వెళ్ళవలసి వచ్చినా భార్య ఎప్పుడూ తల వొంచుకుని భర్త వెనుకే నడుస్తూ వుండేది. భార్యను వెంటబెట్టుకుని వెళ్ళటానికి ఏదో ఒక పెద్దబరువు మోస్తున్నట్లు భర్త చికాకు పడుతూ వుండేవాడు.

విశ్వేశ్వరరావు, తనూ నూజివీడుకి వచ్చిన సినిమాకల్లా వెళ్తూవుండేవారు. విశ్వేశ్వరరావు ఎంత బ్రతిమాలినా బలవంతపెట్టినా మొదట్లో తను అతనితో కూర్చోటానికి సుతారమూ యిష్టపడలేదు. నెమ్మదినెమ్మదిగా అలవాటైంది. కాని ఎంత అలవాటైనా అతని పక్కన కూర్చుంటే సినిమా చూడబుద్ధయ్యేది కాదు. సినిమామీద దృష్టి నిలపటమే కష్టమయ్యేది. అతని మాటలు తన చెవుల్లోకి చొరబడేవికావు. ఎప్పుడు వెళ్ళి ఇంట్లో పడదామా అనిపించేది. చూస్తున్నంతసేపూ ఏదో చెరలో ఉన్నట్లే అనిపించేది.

ఇక్కడ అలాకాదు—స్త్రీలే చకచకా నడిచివెళ్ళి టిక్కెట్లు తెస్తున్నారు. స్త్రీలే ఎక్కువగా మాట్లాడుతున్నారు. స్త్రీలు లోపలికి దారిచూపుతుంటే పురుషులు వారిని అనుసరిస్తున్నారు. స్త్రీల నవ్వుల వెలుగులతో ఆ ప్రదేశమంతా నిండివుంది.

మెట్లదగ్గరవున్న తనపక్కనుంచి ఒకస్త్రీ గబగబా పురుషులకు వలె బూట్ల చప్పుడు చేసుకుంటూ పైకి నడిచింది. ఆమెకు సంబంధించిన పురుషుడు ఆమెతోపాటు నడవలేక నడవలేక నడుస్తున్నాడు.

వాళ్ళను చూస్తూంటే తను ఆ ప్రపంచానికి చెందలేదనిపించింది కళ్యాణికి. ఆ ప్రపంచ నియమాలూ, సూత్రాలు, చట్టాలూ వేరనుకుంది. అక్కడ కాసేపు ఆలోచిస్తూ నిలబడిందేమో మెట్లపైనుంచి, "రావేం కళ్యాణీ?" అని పిల్చాడు జయరామారావు.

ఆ పిలుపుకి తను ఉలిక్కిపడింది. తనను తీసుకువెళ్ళటానికిగాను జయరామారావు మెట్లుదిగి రావటం చూచింది. తాను నెమ్మదిగా మెట్లెక్కింది. ఆమెకాళ్ళు బరువెక్కినవి. ముందుకు వంగిగాని మెట్లక్కలేకపోయింది. ఆ విధంగా మెట్లెక్కడం జయరామారావు మనస్సుకి ఆహ్లాదం కలిగించింది.

నవ్వుతూ ఎదురుగావచ్చి. "సహాయం చేయనా?'' అని ఆమె చేయి పట్టుకోబోయాడు. అతని కా అవకాశం కలగకుండా చెయ్యి రిక్కించుకుని, గబగబా ముందుకు నడిచింది కళ్యాణి. అతను అమితానందంతో ఆమెను అనుసరించాడు.

జయరామారావు తన వెనుక నడవటం ఆమెకు మనస్కరించలేదు. వెనుకనుంచి తన్నే తదేకధ్యానంతో చూస్తూ వుంటాడని ఆమె వూహించింది. ఆ ఊహకు ఆమె ఒళ్ళు జలదరించింది. భుజం మీదుగా వేలాడుతున్న పమిటను తన వెనుకభాగం కనబడకుండా సర్దుకుంది.

పై అంతస్తు, అప్పటికే ఆట ప్రారంభించినందువల్ల అంతా చీకటిగావుంది. ఆమెకు ఏదో ఒక అగాధంలోకి అడుగు పెడుతున్న ట్లనిపించింది.

పక్కకువచ్చి, "అప్పుడే వాళ్లు వెళ్లి కూర్చున్నారు..." అన్నాడు జయరామారావు, సుందరినీ, సదానందునీ ఉద్దేశించి.

అతని మాటల గాలి ఆమె మెడను వేడిగా స్పృశించింది.

''ఇటురా.'' అని పక్కకు దారి తీశాడు జయరామారావు.

అంతకుముందే సీట్లలో కూర్చున్న వారిని ఒరుసుకుంటూ యిద్దరూ నడిచారు. అడుగడుక్కీ కూర్చున్నవారి కాళ్లు కళ్యాణిని తాకుతూనే వున్నై. ఆ చీకటిలో వాళ్ళ మొఖాలైతే స్పష్టంగా కనబడటం లేదుగాని, తనను తాకుతున్న కాళ్ళల్లో పురుషుల కాళ్ళే ఎక్కువగా వున్నయని యిట్టే గ్రహించింది కళ్యాణి. కొందరు ఇంకా ముందుకు జరగటంకూడా ఆమె పసికట్టింది.

నూజివీడులో యిలా జరిగుంటే ''ఛీ-పాడు" అనుకుని వెంటనే యింటికి వెళ్ళిపోయి వుండేది కళ్యాణి. ఇప్పుడు యిక్కడ చేసేదిలేక నెమ్మది నెమ్మదిగా జరుక్కుంటూ కాళ్ళను తప్పుకుంటూ ముందుకు నడిచింది. అప్పటికే తమకోసం రిజర్వు చేయబడిన సీట్లలో, ముందు వాటిల్లో సుందరీ సదానందులు కూర్చుని వున్నారు. జయరామారావు గబగబా వెళ్లి చివరి సీట్లో కూర్చున్నాడు. ఇక కళ్యాణికి మిగిలింది జయరామారావు పక్క సీటే. ఆ సీటు పక్కన సదానంద్ సీటుంది. ఆ యిద్దరి మొగవారి మధ్యలో కళ్యాణికి కూర్చోబుద్ధికాలేదు.

కళ్యాణి తటపటాయించడం చూసి, "అక్కడ కూర్చో కళ్యాణీ – కూర్చో" అన్నది సుందరి.

''సదానంద్‌గారిని అక్కడ కూర్చోమనక్కా, నేనిక్కడ కూర్చుంటాను'' అని గొణిగింది కళ్యాణి.

''అదేం బాగుంటుందమ్మా'' అన్నది సుందరి.

''పోనీ నువ్వెళ్ళి కూర్చో''

''భర్తపక్కన భార్య, భార్యపక్కన భర్త కూర్చుంటే చూసినవాళ్ళంతా

నవ్వరూ ? రేపిక ఎవరి మొగము చూసే ప్రాప్తమూ నా కుండదు. నా మాట విని కూర్చో'' అన్నది సుందరి. దాంతోపాటు కళ్యాణి నిలబడి ఉండటంవల్ల చిత్రం చూడటానికి యిబ్బంది పడుతున్న ఒకాయన, వెనుకనుంచి, ''సిట్ డౌన్ ప్లీజ్'' అని కేకవేశాడు.

ఇక కళ్యాణికి తప్పలేదు. వెళ్ళి జయరామారావు పక్కసీట్లో చతికిల బడింది.

''నా పక్కన కూర్చుంటే — నేనేం కొరుక్కు తిననులే'' అన్నాడు జయ రామారావు. ఒక్క కళ్యాణికే విన బడేటట్టు.

కళ్యాణికి ముళ్ళమీద కూర్చున్న ట్లుంది. ఆమెకు సీటు ఎత్తు చాలలేదు. కాళ్ళు చాచుకోడానికి సిగ్గువేసింది అలాగే ముడుచుకు కూర్చుంది.

సినిమా జరుగుతూవుంది. కాసేపటి వరకు తన పరిసరాలను మర్చిపోలేక పోయింది కళ్యాణి. సుందరన్న మాటలు పదేపదే జ్ఞాపకమొచ్చినవి. 'భర్తపక్కన భార్య, భార్యపక్కన భర్త కూర్చుంటే చూసినవాళ్ళంతా నవ్వరూ ?' అన్నది సుందరి. ఆమాట చాలా విడ్డూర మనిపిం చింది కళ్యాణికి. 'భర్తపక్కన భార్య కూచోక పరపురుషుడి పక్కన కూర్చుం టుందా ? అలా కూర్చోవటం ఏమి ఫేషనో — ఏంపాడో...నూజివీడులో అయితే ఇటువంటివి ఊహించటానికే




"డాక్టరుగారూ ! ఒకసారి ఇంటికి రండి. నా భార్య నన్ను పిచ్చివాడంటుంది. నేను నా భార్య పిచ్చిదని నే నంటున్నాను. ఇద్దర్లో ఎవరు పిచ్చివాళ్లో మీరొచ్చి తేల్చండి."

వాంతు లొచ్చి వుండేవి' అని తలపో సింది కళ్యాణి. అయితే ఇంగ్లీషువాళ్ళలో యిటువంటి ఆచారం వున్నదని చెప్పగా ఒకసారి విన్నది.

ఆ మాటవిని ''దరిద్రం'' అన్నది కళ్యాణి ఆనాడు.

అటువంటి తను ఇద్దరు పరపురుషుల మధ్య కూర్చోవటం భగవంతుని లీలలో ప్రముఖ లీలగా కనిపించిందామెకు.

''ఏమి టాలోచిస్తున్నావు కళ్యాణీ?'' అ నడిగాడు జయరామారావు.

''ఏమీలేదు'' అన్నది కళ్యాణి.

''నామీద కోపమొచ్చిందా ?'' అని ఆమెవైపు వంగి, ముఖంలోకి చూస్తూ అడిగాడు జయరామారావు.

''కోపమెందుకు ?'' అన్నది కళ్యాణి, అవతలపక్కకు జరుగుతూ.

"ఈ చిత్రం నువ్వు చూడవలసిన చిత్రం"

కళ్యాణి మాట్లాడలేదు.

"ఎందుకో తెలుసా ?

కళ్యాణి మాట్లాడలేదు.

"ఇందులో యాక్టుచేస్తున్న మీనా కుమారికీ నీకూ చాలా పోలిక లున్నవి కళ్యాణీ..." అన్నాడు జయరామారావు.

అప్రయత్నంగా 'మీరూరుకుందురూ' అన్నది కళ్యాణి.

ఇక కాసేపు జయరామారావు మాట్లాడలేదు నెమ్మది నెమ్మదిగా తన పరిసరాలను మర్చిపోయి, చిత్రం చూడటంలో లీనమైంది కళ్యాణి

ఆ చిత్రంలో కథానాయకుడు ప్రదీప్ కుమార్ అప్పుడు నాయికా నాయకుల మధ్య ప్రేమకలాపం జరుగుతూవుంది. కథానాయకుడు కొంచెం దూరంగా చెట్టు నానుకుని నుంచుని, మీనాకుమారిని తన చెంతకు రమ్మని చేతులు చాచాడు మీనా కుమారి ఒక క్షణం నిష్ఠూరంగా చూసి, ఒక క్షణం ఆలోచించి, ఒక క్షణం సిగ్గు పడి, మరుక్షణం ధైర్యం తెచ్చుకుని, మరుక్షణం సిగ్గుదొంతర్లను వెలువరిస్తూ హంసగమనంతో వయ్యారంగా నడుస్తూ వెళ్ళి, అతని చేతుల్లో వ్రాలి, అతని రొమ్ముపైని తల ఆన్చి, అంతలో మళ్ళీ సిగ్గుపడింది

వెంటనే ఒక నిట్టూర్పు విడిచాడు జయరామారావు. ఆ నిట్టూర్పు వేడికి ఇహలోకంలోకి వచ్చింది కళ్యాణి.

"చూశావా కళ్యాణీ మీనాకుమారి ఎంత మనోరంజితంగా అభినయించిందో! భారత స్త్రీలో ఉన్న ఆకర్షణను ప్రదర్శించటం ఆమెకు వెన్నెతోపెట్టిన విద్య ఈ విద్యముందు 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని అనటంగానీ, అలా అని గాఢంగా కావలించుకుని ముద్దుపెట్టుకోవడంగాని దిగదుడుపే. అందుకనే మీనాకుమారి అంటే నాకు ప్రాణం. ఆ లక్షణాలు నీలో ఉండబట్టి నువ్వన్నా అంతే......" అన్నాడు జయరామారావు

తను మెదలకుండా వూరుకుంటే ఇంకా ఏమంటాడో అని భయంవేసింది కళ్యాణికి అతని దృష్టిని అతని భావాల నుంచి తప్పించటానికి గాను "సినిమాను చూడ నిద్దురూ" అన్నది.

"చూడు కళ్యాణీ — చూడు. నువ్వు తనివితీరా చూడాలనే నా వుద్దేశం కూడానూ" అని అన్నాడు జయరామారావు.

అంతకు ముందయితే అనిపించ లేదుగాని ఆ క్షణం సుందరి ఏం చేస్తూందో తెలుసుకోవాలని కుతూహలం కలిగింది కళ్యాణికి. కుర్చీకి చేరగిలబడి ఆమె వేపుకు తిరిగి చూసింది. సుందరీ




"పదిరోజుల నుండి మలేరియా జ్వరంతో చస్తున్నానండీ!!!"

"ఏ రోగం నిర్ణయించాల్సిందీ మేం. మీరే రోగాల పేర్లు చెప్పేస్తే, యిక్కడ మేమెందుకయ్యా పెద్ద పెద్ద డాక్టర్లం?"

---

సదానందులు ఒకరిపక్కకు ఒకరు జరిగి ఒకరిమొగంలో ఒకరు మొగం పెట్టుకుని, ఏవో గుసగుసలాడుతున్నారు అప్పటికి కళ్యాణి కండ్లకు చీకటి అలవాటు పడింది అలవాటయిన ఆ చీకట్లో సదానంద్ సుందరి భుజంమీద చేయివేసుకు కూర్చోవటం ఆమెకు కనిపించింది. ఆమె హృదయం దడదడ కొట్టుకుంది. ఆ దృశ్యం చూడలేక ముఖం తిప్పుకుంది. కండ్లముందు సినిమా జరుగుతూవుంది. ఆమె మనస్సు మాత్రం సినిమా మీద లేదు ఏ భార్య అయినా, ఏ స్త్రీ అయినా యింత అమానుష చర్యకు ఎలా పాల్పడుతారో ఆమెకు అర్థం కాలేదు. అందులో చదువుకుని, ప్రపంచ జ్ఞానాన్ని పొందివున్న సుందరి ఈ స్థితికి దిగజారటం ఆమె ఊహకు ఏమాత్రం అందలేదు. తన కనులను తానే నమ్మలేకపోయింది. 'ఈ విషయం జయరామారావుకి తెలిస్తే ఏమవుతుంది?' అని తనకుతాను ప్రశ్నించుకుంది. వెంటనే 'ఆయనకు తెలుసేమో!' అని అనుమానించింది. అప్రయత్నంగా ఆయనవైపుకి చూపులను తిప్పింది.

జయరామారావు సినిమా చూస్తూ కూర్చున్నాడు. వెంటనే కళ్యాణి తనను

చూస్తున్నట్టు గమనించి. "ఏమిటి కళ్యాణీ?" అనడిగాడు

"ఏమీలేదు"

"డ్రింకు తెప్పించమంటావా?"

"వద్దండీ — వద్దు"

"నీతో పరిచయమవటం నా అదృష్ట మనీ, భాగ్యమనీ అనుకుంటున్నాను కళ్యాణీ" అన్నాడు జయరామారావు. ఏదో పెద్ద రహస్యం చెప్తున్నట్టు ఆమె చెవిలో ఈ మాటలను ఊదాడు.

"చాల్లెండి" అన్నది కళ్యాణి, కాస్త విదిలింపుగా

కానీ జయరామారావుకి అది విదిలింపుగా వినబడలేదు ఏదో పిలుపుగా వినిపించి, తనలో తాను నవ్వుకున్నాడు

సినిమాలో మరొక దృశ్యం నడుస్తూ వుంది నాయికా నాయకులైన మీనా కుమారికీ, ప్రదీప్ కుమార్ కీ మధ్య అపోహలు కలిగినై మీనాకుమారి ప్రవర్తనను ప్రదీప్‌కుమార్ శంకించి, ఆమెను నిందించి, కోపంగా ఇంట్లోంచి వెళ్ళిపోయాడు మీనాకుమారి ఆలోచిస్తూ ఇంటిముంగిటవున్న స్థంభాన్ని ఆనుకుని విచారంగా కూర్చునుంది. ప్రదీప్‌కుమార్ చెట్టాపుట్టా పట్టుకుని తిరిగితిరిగి మళ్ళీ యింటికొచ్చాడు అతన్నిచూసి, మీనా కుమారి లేచి నిలబడింది వారిద్దరిమధ్య చూసేవారికి ఏదో పెద్దజగడం జరగ బోతోందనిపించింది

కాని అలా జరగలేదు.

"ఎక్కడికి వెళ్ళారూ?" అనడిగింది మీనాకుమారి. ఆమె గొంతులో నిష్టురత్వంతో కూడిన ప్రేమోన్మత్తత ఖంగున మోగింది.

"నీకు చెప్పవలసిన అవసరం లేదు" అన్నాడు ప్రదీప్‌కూమార్. అతని గొంతు లోని కర్కశత్వానికి దిక్కులు పిక్కటిల్లాయి

ఆ ధ్వనికి మీనాకుమారి చలించలేదు. "చాల్లెండి, మీతో ఒక మాట మాట్లాడాలి — రండి" అని ముందుకు నడిచింది

ఆమె గొంతులో అల్లరి చేసిన పిల్ల వాడిని మందలించే మాతృహృదయం తొణికిసలాడింది దానిమీదట భర్తపట్ల తన ప్రేమ — పవిత్రమైన, విప్పారిన, పండిన ప్రేమ లీలగా ధ్వనించింది ఆ ధ్వనికి కోపంతో మండిపోతున్న ప్రదీప్ కూమార్ యిట్టే లొంబడిపోయాడు. పరవశుడైయాడు పిల్లివలె ఆమె ననుసరించాడు.

ఆ దృశ్యం చూసి, "ఉఫ్" అన్నాడు జయరామారావు కళ్యాణివైపుకి తిరిగి, "చూశావా ఎంత మనోహరంగా వుందో...స్త్రీలో ఉండవలసిన లక్షణా లన్నీ మీనాకుమారిలో వున్నై ఆమె దగ్గరున్న సమ్మోహనాస్త్రాలకు కొదువే లేదు. ఆమెను చూశాను — మళ్ళీ నిన్ను చూస్తున్నాను" అన్నాడు అని, కళ్యాణి చేతిని తన చేతులోకి తీసుకున్నాడు.

(సశేషం)



# యువతీలోకం



## ప్రముఖ భారత మహిళలు

### రామాయణంలోని లంకావాసినులు

'లంకను పుట్టినదల్లా రాక్షసే' ననడం లోకంలో ఉన్న రివాజు కానీ లంకలోని వారందరూ రాక్షసులుకారు కాకపోగా వారిలో దేవతా తుల్యులైన వారుకూడా ఉన్నారు. అటువంటి వారిలో 'సరమ వొకరు

రావణుని తమ్ముడు విభీషణుడు విభీషణుని భార్య సరమ దరిదాపులేని మహా ఎడారిలోని నీటిపడియ వంటిది సరమ ఆమె సన్నిహితత్వమే లేక పోతే, సీతాదేవి 'లంకావాస జీవితం' మరింత దుస్సహంగా ఉండేదనడంలో అనుమాన మేమీలేదు.

సీతను అపహరించుకొని వచ్చిన రావణుడు, ఆమె మనస్సును చూరగొన డానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఎన్నో ఆశలు చూపించాడు నిన్ను ప్రధాన పట్టమహిషిని చేస్తానన్నాడు. సీతాదేవి మనస్సు చలించలేదు. ఆఖరుకు మాయోపాయాలతో ఆమెను లొంగ దీసుకోవా లనుకొన్నాడు.

అప్పటికే శ్రీరాముడు, వానర సైన్య సమేతంగా వచ్చి, యుద్ధానికి సన్నద్ధు డవుతున్నాడు ఇటు రావణుడు కూడా, తన సైన్యాధికారులను సంప్రదించి యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నాడు ఇరు పక్షాలవారూ, ఘోర యుద్ధాన్నెదుర్కొన డానికి సంసిద్ధంగా ఉన్నారు అసలింతటి యుద్ధానికి కారణం సీతాదేవియే! జయాప జయాలెలా ఉన్నప్పటికీ, ఆఖరుసారిగా మరో ప్రయత్నం చేదా మనుకొన్నాడు రావణుడు తన మాయా శక్తితో, రాముని శిరస్సును పోలిఉండే శిరస్సును సృష్టించాడు ఆ శిరస్సును పట్టుకొని సీతదగ్గర కొచ్చాడు

''నీవు సర్వంసహాశక్తివంతు డను కొనే నీ రాముణ్ని సంహరించాను. ఇదిగో అతనితల. నువ్విప్పటికైనా,

---

కంఠంనేని ఉషాదేవి

అతనినుండి మనస్సును మళ్ళించుకో. నన్ను చేపట్టు" అన్నాడు రావణుడు.

ఆ శిరస్సును చూసిన సీత, నిజంగా అది తనభర్తదే ననుకొన్నది. ఆశోప హతురాలయింది. దుఃఖభారంతో మూర్ఛ పోయింది. రావణుడు మరుక్షణమే అక్కడినుండి వెళ్ళిపోయాడు.

సరమను, సీతకు తోడుగా పంపిన వాడు రావణుడే! ఆమెవచ్చి సీతాదేవిని వోదార్చింది. "రావణుని గురించి నువ్వేమీ భయపడకు. అతనన్న మాటలూ, దానికి నీ సమాధానమూ నేను విన్నాను. నీకు త్వరలోనే మంచికాలం రాబోతూఉంది లక్ష్మీదేవి దయవలన, నీ బాధలన్నీ తీరిపోతాయి శ్రీరాముడు ఇప్పటి కప్పుడే దక్షిణ సముద్రతీరంలో సైనికులతో విడిసి ఉన్నాడు. రావణుడు, సైన్యాధికారులతో సమాలోచనలు జరుపుతున్నాడు. అయినా అతను వోడి పోక తప్పదు" అన్నది సరమ.

సీత అంగీకరిస్తే గగనమార్గాన ఆమెను రాముని సన్నిధిని చేర్చుతా నన్నది. సీత దీని కంగీకరించలేదు

· సరమ జీవితం చాలా విచిత్రమైనది. ఒకవైపున అపారిమైన బంధుకోటి, మరొకవైపున న్యాయమూ నిలిచి నప్పుడు, సరమ న్యాయపక్షానే నిల బడింది. ధర్మంకోసం, తనవారి నాశ నానికి పరోక్షంగా తోడుపడింది. రావణ వధానంతరం, విభీషణునితోబాటు ఆమె కూడా అయోధ్యా నగరాన్ని సందర్శిం చింది.

మాహాసాధ్వి మండోదరి చరిత్ర ఇంతకన్నా పూజనీయమైనది ఇటువంటి మహా ప్రతివ్రతలు, చాలా అరుదుగా ఉన్నారు. మండోదరి తండ్రిపేరు మయుడు. ఇతను దానవులకు అధిపతి. మండోదరికి తగినభర్తను సమాకూర్చ డంకోసం మయుడు ముల్లోకాలనూ అన్వే షించాడు ఉన్నవారందరిలోకీ రావణుడు ఉత్తముడుగా తోచిన కారణాన, మండోదరిని అతనికిచ్చివివాహంచేశాడు.

మండోదరి రాక్షసరాజు భార్య అయి నప్పటికీ గుణగణాలలో పూజనీయురాలు. రావణుని బాహు పరాక్రమం ఆమెను ముగ్ధురాలను చేసింది.

హనుమంతుడు, శ్రీరాముడు కూడా అతన్ని గౌరవించిన సందర్భాలున్నవి.

హనుమంతు డిలా అంటున్నాడు—

"రావణుని ఆకారము, శక్తి, నన్ను విభ్రమ చకితుణ్ని చేస్తున్నాయి. దేవ తలను సైతం జయించగల ధీశాలి"

మధ్యాహ్న సూర్యునిలాగా రావణుడు దుర్నిరీక్ష్యంగా ఉన్నాడని శ్రీరాము డం టాడు. అటువంటివాడికి భర్త కాగలిగి నందుకు మండోదరి ఎంతగానో గర్విం చింది. ఇందులో తప్పేమీలేదు.

సీతను తెచ్చినందుకు మండోదరి అసూయపడలేదు, విచారించింది. అంత వరకూ ఆమె ఉన్నత స్థానానికి లంకా

రాజ్యంలో ఎటువంటి అడ్డూ లేక పోయింది. సీత రాకడతో పరిస్థితులు మారిపోయాయి రావణుని మనస్సు నిండా సీతరూపం ఆక్రమించుకొనిఉంది. అహోరాత్రాలు ఆమెకోసం, రావణుడు కలవరించ సాగాడు

సీతను విడిచిపెట్టవలసిందని మండోదరి, ఎన్నో విధాలుగా భర్తను ప్రాధేయ పడింది.

"మీరు చాలా పొరబడుతున్నారు. సీత మహా సాధ్వి, పునీత. ఆమె దుఃఖాగ్ని మన సర్వస్వాన్నీ తుడిచి పెడుతుంది మనబంధువులందరూ నామ రూపాలు లేకుండా నశిస్తారు. శ్రీరాముడు విష్ణ్వాంశ సంభూతుడు భగవద్విరోధి వైన నీనుండి, ఈ ప్రపంచాన్ని రక్షించడానికి మానవ రూపంలో అవతరించాడు. వానరులందరూ దేవతా స్వరూపులే!" అని బోధించింది మండోదరి.

ఆమె మాటలు రావణుని చెవికెక్కలేదు. చివరికి అనుకొన్నంతా జరిగింది.

మండోదరిలోని గొప్పతనం, ఆమె సహనశీలత, పతిభక్తిని భయంకరంగా యుద్ధం జరుగుతూఉంది. వేలాది రాక్షస సైనికులు హతమారిపోతూ ఉన్నారు. ఆమె సన్నిహితులు, బంధువులు, బిడ్డలు, మరది ఈ సంగ్రామంలో దారుణంగా మరణించారు సకల భోగాలతో కళకళలాడుతూ ఉండే లంకాపురంమీద రాబందులు రాజ్యంచేశాయి. ఇంత నాశనం జరిగినా ఆమెభర్త నెన్నడూ దూషించ లేదు బిడ్డలను, భర్తను, మరదిని, సంతోషంతో యుద్ధరంగానికి పంపగలిగింది.

రావణుడు సంహరింప బడినతరువాత ఆమె విచారం కట్టలు తెంచుకొని వెలికి ఉరికింది. రావణుని మొండెంమీదపడి, గుండెలు కరిగిపోయేలా రోదించింది.

"సీతకన్నా మించిన అందకత్తెలు ఎందరో నీ అందుబాటులో ఉన్నారు. వారెవ్వరూ నీకు నచ్చలేదు నాకన్నా కూడా సీత అధికురాలుకాదు, కనీసం సమానురాలైనా కాదు. అయినా నన్ను నీవు నిరాదరించావు. ఏదోవొక కారణం లేకుండా మృత్యువు మానవుణ్ని సమీపించదు. నీ మరణానికి కారణం సీత. మహా పతివ్రతలను ఏడ్పించిన దోషానలం, నీతోబాటు నీచుట్టూ ఉన్నవారిని కూడా భస్మీభూతం చేసింది!" అంటూ రోదించింది మండోదరి!

దానవాధిపతియైన మయునికి కూతురుగా జన్మించి, రాక్షసచక్రవర్తికి ఇల్లాలై, దేవేంద్రుణ్నికూడా చిత్తు చేయగలిగిన కొడుకునుకనికూడా, మండోదరి దుఃఖభారంతో జీవితశేషాన్ని గడపవలసి వచ్చింది.

గత వైభవాల తాలూకు స్మృతులతో, అప్పటి దౌర్భాగ్య పరిస్థితులను పోల్చుకొన్నప్పుడు మండోదరి హృదయం ఎంతగా కుమిలిపోయిందో ఎలా చెప్పగలం?

★

# సినిమా క్విజ్




పై నాలుగు బొమ్మలూ నాలుగు సినిమా పేర్లు తెలియజేస్తవి  ఏమిటవి ?

(జవాబులు 96 వ పేజీలో)

# ఆత్మార్పణం

"ప్రేమోన్మత్తనై, తీరని దాహంతో నీ సన్నిధికి వచ్చాను ప్రభూ, నా హృదయాన్ని నీకే అర్పించాను. నీదైన నా మనసును నీవు తీసుకున్నా సరే, త్రోసిపుచ్చినాసరే!" అంటుంది సుభద్రాచౌహాన్ ఒక భక్త్యావేశంలో.

'మనసివ్వడం' అంటే అది! లోకంలో ప్రతినాయిక ప్రియునికి మనసిచ్చినట్లే భావిస్తుంది. వాదిస్తుంది కాని నాయకుడు అరఘడియ ఆలస్యంగా వస్తే "నాకన్న నీకు నీ పనే ఎక్కువ లే" అంటూ నిష్ఠూరా లాడుతుంది. మా తమ్ముడు యింటికి ఆలస్యంగా వచ్చిననాడల్లా "ఆడవాళ్ళను యిలా 'పుసురుపెట్టక' పోతే ఆ మైక్రోస్కోపునే పెళ్ళాడక పోయారూ" అంటుంది మా మరదలు 'ఉత్తమా ఇల్లాలు' పోజుపెట్టి.

మా నాన్నగారి స్నేహితులు వెంకట్రావుగారు చెప్పారు ఒకసారి ఓరోజు ఆయన పుస్తకాలపెట్టిలో పాత కాయితాలమధ్య ఓ అమ్మాయి ఫోటో —పేపర్లోంచి చింపి దాచుకున్నది ఆయనభార్యకు దొరికిందట. 'ఎవరిదీఫోటో' అని భర్తనడిగిందట ఆ యిల్లాలు "అది గ్రేటా గార్బో! ఆమె నటించిన ప్రతి చిత్రమూ మూడు నాలుగుసార్లు చూస్తుంటాను నేను" అన్నారట ఆయన ఆ సంగతి చెప్తూ ఆయన "దానితో మా ఆవిడ వారం రోజులవరకు నాతో మాట్లాడితే ఒట్టు" అన్నారు

ఎందుకు చెప్పానంటే యీ ఆడవాళ్ళందరూ మనస్సు ధారపోసేమని మొర పెట్టేవాళ్ళే! కాని ఆత్మార్పణ అంటే అర్థమే తెలియదు వీళ్ళకి వీళ్ళ మనస్సు వీళ్ళు వదలుకోలేరు సరికదా, ఇంకొకరి మనసులో చోటు చేసుకునే తాపత్రయంలో పడేబాధ అదంతాను! చోటు దొరక్కపోదు లోకం గొడ్డుపోయిందా, ఏ మనసులోనైనా కూర్చునే చోటు దొరకొచ్చు కాని ఆ థర్డుక్లాసు ప్రయాణం వీళ్ళకు గిట్టదు పెట్టె అంతా ఖాళీచేసి, సుఖంగా పక్కలు అమర్చి వీళ్ళను పిలవాలి అంతే అయితే ఫరవాలేదు. కాని అక్కడ వీళ్ళకు మాత్రమే సీటు యివ్వాలి పైబర్తు ఖాళీగా వున్నాసరే, ఇంకెవరూ వచ్చి పడుకోటానికి వీల్లేదు.

ఈ అమ్మాయిలను చూస్తే జాలి వేస్తుంది 'పాపం' అనిపిస్తుంది. వాళ్ళ

విజయలక్ష్మి

మాటలు వింటేమాత్రం కోపం వస్తుంది. ఏదో త్యాగం చేసినట్లు పోజులు పెడ్తే ఒళ్లు మండుతుంది. ఆత్మార్పణ అందరికీ చేతనయ్యేది కాదు తన్ను తాను అర్పించుకోడం అంటే, వ్యక్తిత్వాన్ని కోల్పోవడం కాదు. ఒక వ్యక్తికో, ఒక ఆదర్శానికో బానిసకావడం కాదు. అదొక వున్నతమైన ఆధ్యాత్మిక అనుభవం. క్రీస్తు, త్యాగరాజు, మీరా, గాంధీ — వీళ్ళంతా వ్యక్తిత్వాన్ని కోల్పోయిన వారుకారు. ఆత్మార్పణ జేసుకున్న వారు.

మనసు యివ్వడంకన్నా శాంతిప్రదమైనది ఇంకోటి లేదు జీవితం విమానంలాగా పైకెగిరి, పైకి, పై పైకి మబ్బుల దాటుకు వెళ్ళిపోగలదు. మనసు కోరుకోవడం కన్నా భారమైనది మరొకటి లేదు — పాతికేళ్లకే ఫలిత కేశాలు, కళ్ళు చుట్టూ నీలి వలయాలు, అందరికీ అపహాస్యం

ఆత్మార్పణయొక్క విశిష్ఠత, ప్రయోజనం దాని సబ్జక్టు మీద ఆధారపడి వుంటాయి భర్తకు భార్య, భార్యకు భర్త మనసివ్వగలిగితే, వాళ్లు సంసారయాత్రలో శాంతికోసం తపించడం జరగదు. ఆత్మార్పణా భావం యింటిగోడలు దాటి బయటకు వెళ్ళగలిగితే, లోక కళ్యాణం జరుగుతుంది. అనంతమైన సత్యాన్వేషణకు ఆత్మార్పణ చేసుకున్న వారికి లభించే ఆనందం అలౌకికం ఐన్‌స్టీన్‌కన్నా, సుభాష్‌బోసుకన్నా, ఫ్లారెన్సు నైటింగేల్‌కన్నా, వీరేశలింగంకన్నా ధన్యజీవులుంటారా ?

---

సినిమా క్విజ్ - జవాబులు

1. శాంతినివాసం
2. ఆరాధన
3. మా ఇంటి మహాలక్ష్మి
4. చివరకు మిగిలేది

---

# విపరీత ధోరణులు

రోజూ చూస్తూఉండేపరిసరాలు, నిత్యం కలసిఉండే వ్యక్తులూ అనుక్షణం మారుతూంటూన్నా మనం ఆ మార్పులను గుర్తించడం, వాటిని అంచనా వేయడం కష్టం. మనకు చాలాకాలంనుంచి తెలిసిన పరిసరాలకూ, వ్యక్తులకూ కొంతకాలం చాలా దూరంగా ఉండి — మళ్ళీ దర్శనం చేసుకున్నప్పుడు — ఈలోగా పరిణమించిన మార్పులు కళ్ళకేగాక, మనసుకు కూడా కొట్టవచ్చినట్లు అర్థమవుతాయి.

కొన్నేళ్ళు ఇతర రాష్ట్రాలలో ఉండి ఇటీవలనే మన ప్రాంతాలకు వచ్చిన నాకు మన యువతులతో, పెద్ద మహిళలలో వచ్చిన మార్పులు చాలా విచిత్రంగానూ, విపరీతంగానూ కనుపించాయి. వర్గాభిమానం అడ్డురాకుండా నిర్మొహమాటంగా విమర్శించుకోవలసిన లక్షణాలు ఎన్నో కనుపించాయి.

మా స్వగ్రామంలో జరిగిన ఒక సంఘటన నన్నీ విలక్షణాలవైపు ఆకర్షించింది. ''సోషల్ వర్కర్''గా తరిఫీదు పొందినదాన్నేమో — ఈ అంశాలను ఆసక్తితో పరిశీలించాను. కొన్నికొన్ని ''హృదయవిదారక'' మనిపించి, "మన ఆంధ్ర సోదరీమణులు ఇంత విపరీత ధోరణులకు మళ్ళినారా !" అని ఆశ్చర్యం కలిగింది.

* * *

కమల నాకు ఆబాల్యస్నేహితు తగుమాత్రం చదువుకుంది ష మాగాణి భూమిగల తలిదం ( ఒక్కగానొక్క కూతురు. బి. ఏ. ఉద్యోగం చేసుకుంటున్న అన్న, మె( మోకాలి పర్వతం ఎక్కలేక వ్యవస యానికే మళ్ళిన అన్నా గల సోదరి. సుగుణశీలయనీ, సంసారపక్షంగా కాపురం దిద్దుకోగల నెమ్మదస్తురాలనీ మిత్రుల మందరం అనుకునేవాళ్ళం.

తలిదండ్రులు ఆమెను ఉద్యోగికిచ్చి పెళ్ళి చెయ్యాలని చాలా ప్రయత్నించారు. లోయర్ డివిజన్ గుమాస్తాగిరి తప్ప — వెనక ఆధరువేమీ లేని వారు కూడా పది

కుమారి రాధ

వేల కట్నం అడుగుతున్నారు. వెనక పొలం పుట్రాకూడా వున్నవారు కావాలని వెదకడంలోనే కమలకు వయసు మీరు తున్నదనే భయం వేసింది. చివరికి 12 వేలు కట్నం ఇచ్చి అయిదెకరాల భాగం రాగల రైతుబిడ్డకిచ్చి పెళ్లి చేశారు.

వరుడు బుద్ధిమంతుడు, అందగాడు, వళ్లొంచి పనిచేసి ఎకరాకు మూడు పుట్లదాకా పండించేవాడు. కమల కోరిక ప్రకారం వేరుపడ్డాడు, భార్యను అత్తారబతంగా చూచుకుంటున్నాడు. కాని మూడేళ్ళు తిరక్కముందే, ముప్పతిప్పల్లో ఇరుక్కుపోయి — ఏనుగంత మనిషీ పీనుగైపోయాడు.

నేను మావూరుకు వెళ్ళిన మర్నాడే ...ను కలుసుకున్నాను. ఆవిడ కళకళ ...గా చాలా సంతోషంగా ఉన్నట్లు ...ంది. తలిదండ్రులు పెట్టిన పది ... బంగారం, పెళ్ళికి అత్తవారు ...ం పన్నెండు తులాల బంగారం ఉంది ...ళ్ళో. నెక్లెస్ కాక చంద్రహారం, మిరియాల గాజులు, చెక్కుడు గాజులు గాక రాళ్ళ గాజులు, నాలుగు వుంగరాలు, వత్తుదండ కడియంలాంటి అరవంకి... పాత, కొత్త ఫేషన్లు రెండూ వుండాలన్నట్లు అన్నీ ఎక్కువే అనిపించాయి.

ఆ మర్నాడు మరో స్నేహితురాలి ద్వారా తెలిసింది — కమలకు "ఏడువారాల సొమ్ము లున్నట్లు" ఒక్కోసగా అనేక రకాలుగా వున్నాయట ' "దానికేం అంచక్కా వెళ్ళబోస్తున్నది. అదృష్టవంతురాలు!!" అంది ఈ స్నేహితురాలు. కాబోసనుకున్నాను. మేం మాట్లాడుకుంటూండగానే కమల మళ్ళీ మాయింటికి వచ్చింది. నా మెడలోని సన్న గొలుసు (రెండు నవరసులుకూడా ఉండదు) బాగుందట, కంసాలికి చూపి తనూ ఒకటి చేయించుకుంటుందట — అడిగి తీసుకెళ్లింది.

ఆ రాత్రి కమల భర్త తమ వూరు నుంచి వచ్చారట. అర్ధరాత్రివేళ అంకమ్మ శోకా లన్నట్లు పెద్ద గోల చెలరేగింది. ఇరుగూ పొరుగు అమ్మలక్కలు వెళ్ళి వినివచ్చారు. ఆగుబ్బుగా చెప్పుకున్నారు. కమల భర్త ఎంత బాగా పండించినా ఏటేటా అప్పులే మిగులుతున్నా యట, ఆమధ్య రెండెకరాలు అమ్మి అప్పులు తీర్చాడట మిగిలిన పొలంలో ఈయేడు చెరకు వేశాట్ట. ఎరువులకు డబ్బు లేదని నానాఅవస్థపడి, భూమి తనఖా బ్యాంకులో వెయ్యి రూపాయలు తెచ్చి ఇంటో పెట్టాట్ట. కమల పుట్టింటికివస్తూ నాలుగు వందలు తెచ్చుకుందట, అతడు ఎరువుల కోసం వెతుతూ చూసుకుని గాభరాపడ్డాడట ఇప్పుడు నగలకేం తొందరా' పొలానికి ఎరువులు అవసరం అని అతని వాదన, "ముచ్చటపడి ఒక చిన్న నగ చేయించుకుని, నాలుగు చక్కని చీరలు కొనుక్కునే ప్రాప్తిలేదని కమల శోకాలు.



"నేను అతన్ని పెళ్లాడకపోతే విషంత్రాగి చచ్చిపోతా నన్నాడు."

"అయితే నీ వేం చేశావు?"

"ఏం చేస్తాను అతని ప్రాణం కాపాడాను"

---

మా గ్రామానికి దగ్గర బస్తీలో శారదా నేనూ కలసి కాలేజీలో చదువుకున్నాం. ఆమెకూ తలిదండ్రులకూ నచ్చిన వరుడే లభించాడు. ఎవరైనా ఆ జంటను చూసి అసూయ పడవచ్చు ననుకున్నాం స్నేహితులం. కావలసినంత ఆస్తి వుండి, అతనికి పెద్ద వుద్యోగం. నౌకర్లూ, చాకర్లూ — కార్లూ, షికార్లూ — అట్టహాసంగా వున్నాయి హంగులు. ఆవిడ తరచుగా నాకువ్రాసే ఉత్తరాల్లోకూడా అన్ని విషయాల లోనూ సుఖసంతోషాలే పొందుతూన్నట్టు వ్రాసేది.

కాని — ఇప్పుడామె ఇంటికి వెళ్ళి రెండు రోజు లుండేసరికి — అంతా తారు

ఆఖరికి అతను విసిగి తెగతెంపులే నన్నట్టు కేకలువేసి అప్పటికప్పుడు వెళ్లిపోయాట్ట కమల ''ఎప్పుడూ ఇంతే — ఒక్క అచ్చటా ముచ్చటాలేదు మట్టి పిసుక్కునేవాడి కిచ్చి నా గొంతు కోశా'' రని తల్లిదండ్రులమీద పోట్లాడి రాగాలు సాగిచ్చింది. తల్లి కడుపు చెరువై పోతుంటే తండ్రి గద్దించటాని క్కూడా వీల్లేకపోయిందట.

ఆ తరవాత ఏమైనా జరగనీయండి — కమల ధోరణి ఏమిటో దాని పరిణామాలేమిటో అర్థం చేసుకుంటే, ఎంత విపరీతం ? !

* * *

మారుగా తోచింది. భార్యా భర్తల మధ్య ఏ చిన్న పొరపొచ్చేలు కూడా లేవు. శారద కోరికను భర్త ఆజ్ఞగా స్వీకరించి మనఃపూర్వకంగా తీర్చేవాడు. అత్త, ఆడుబిడ్డలు, మామా, మరుదులూ కూడా ఏ సాలు కొకసారో గాని తరచు కలుసు కోరు. దేనికీ కొరత లేదు.

నేను వెళ్ళిన రోజంతా చిన్నప్పటి సంగతులు మాట్లాడుకుంటూ, నాటి స్నేహితుల పరిచయస్తుల విశేషాలు చెప్పుకుంటూ గడిపాం. మాకు తెలిసిన అందరికంటె శారద జీవితమే ముచ్చటగా వుందనిపించింది. కాని — మర్నాడు సినిమాకు వెళ్ళినప్పుడు, ఆమె భర్త టిక్కెట్లు తేడానికి వెళ్ళినప్పుడు—శారద ఏమన్నదో తెలుసా? "ఏమైనా నీ అంత ముచ్చటైన జీవితం, స్వతంత్రం, సుఖం అందరికీ లభ్యమౌతాయా?" అని నిట్టూర్చింది.

నేను స్వతంత్రంగా ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన ఆవిడకంటే సుఖమేమీ అనుభవించటం లేదనీ, తగిన భర్తతో గడపటంకంటే స్త్రీకి వేరే స్వతంత్ర జీవితం ఏమిటనీ నే నన్నాను.

శారద మరోసారి దుఃఖం ముంచు కొచ్చినంతగా నిట్టూర్చి — "పెళ్ళి పెళ్ళి అని సంబర పడతాం గాని ఏమిటిలెద్దూ; ఆయన నెంతిదిగా వున్నా—అత్తో ఆడబిడ్డో పుల్లవిరుపుడు మాటలంటూనే వుంటారు. వాళ్ళకదనీ, వీళ్ళకిదనీ పెట్టిపోతలు జరపాలని పోరూ — మేమేదో బాకీ వున్నట్టూ......నీకేం — పూచీ పేచీలేని బతుకు !!" అంది.

ఏం చెప్పను? భాగస్వామి లేని జీవితం—ఎంత స్వతంత్రతా, సంపాదనా, చేతినిండా పనీవున్నా—ఎడారిలా వుంటుం దని శారదకు నచ్చజెప్పగలనా? నూటి క్కోటికి కనిపించే బంధువులు కూడా కనిపించకుండా తనూ తన భర్తా ఆకసం మీదనుంచి ఊడిపడ్డ దంపతుల్లాగా వసంతోద్యాన వనంలో వుండాలనా శారద కాంక్ష? ఇది సహజ వాంఛేనా?

* * *

నిజానికి నాకు మానసిక విశ్రాంతి లేకుండా చేసింది శారద మాటలే! జిజ్ఞాసా పూర్వకంగా అనేకమంది స్త్రీల జీవితాలూ, మనస్తత్వాలూ పరిశీలించాను. పదిరోజుల్లో పది తరాలకు సరిపడే వైప రీత్యాలు గమనించాను......

ఈ కాలం "నినాదాల యుగం" అంటారు రాజకీయ సిద్ధాంతులు. తమ కేమి కావాలో తమకే తెలియక — అర్థం లేని లాలసత్వాలూ కోర్కెలూ పెంచు కోడం, అవి తీరలేదని నిట్టూర్చడం — ఒక్క తీయని తలపుతో వసంతం వర్షించుకోగల జీవితాలను — నిప్పులు పోసుకుని నిప్పచ్చరం చేసుకోవడం నేటి యువతుల జబ్బు అనిపిస్తున్నది నాకు.

# ఉత్తరాలు

ఆంధ్రదేశంలో ఆడవాళ్ళు యెంతెంత బరువు పనులు యిట్టె సునాయాసంగా చేసి అవతల పారేస్తారుగాని, వుత్తరాలు రాయటం మొదలైన పనులు అంటే విసుగుపడిపోతారు. ఆడవాళ్ళే కాదు. చాలామంది మగవాళ్ళు కూడ అంతే. ఎవరికైనా వుత్తరాలు రాయాలి అంటే వాళ్ళ టైమంతా వృధా అయిపోయినట్లు, యేదో నష్టపోయినట్లు అనుకుంటారు. అసలు దేనికదే ప్రత్యేకంగా నైపుణ్యంగా చేస్తే మనిషి చేతుల్లో యే పనైనా కళగా మారిపోతుంది. వుత్తరాలు రాయటం ఓ ప్రత్యేకమైన కళ అంటే మామూలు వాళ్ళకి పరిహాసంగా కన్పించవచ్చు కాని తెలిసిన వాళ్ళకి ఓ అందమైన పనే అని అర్థమౌతుంది.

ఉత్తరాలకీ మా అక్కయ్యకీ బద్ధవైరమనే చెప్పాలి. అక్కయ్య వచ్చి వెళ్తున్నప్పుడల్లా నాన్నగారు ఓ కవర్ల కట్ట తెచ్చి వాటిమీద అడ్రస్‌తో సహా రాసేసి అక్కయ్య చేతికి యిస్తారు. వాటిని చూస్తూనే మొహం ముడుచుకున్న అక్కయ్య చాటుగా నన్ను పిల్చి బ్రతిమలాడ్తూ 'నీకు పుణ్యం వుంటుంది ఈసారి వచ్చేటప్పుడు బావగారి నడిగి నీక మంచి పుస్తకాలు తెచ్చిపెట్టాను' అని లంచం చూపించి నాచేత ప్రతిదాంట్లోను 'నేను క్షేమం. మీ క్షేమం తెలుపండి' అనో 'నాకు మిమ్మల్ని చూడాలని వుంద'నో యిలా రకరకాలుగా రాయించి అంటించేసి తీసుకెడ్తుంది ఆపైన దానికి వీలయినప్పుడు గుర్తున్నప్పుడు ఒక్కొక్కటి పోస్టు చేస్తుంది. ఒకసారి అక్కయ్య మీద కోపం వచ్చిన నేను ప్రతిదాంట్లోనూ ఒకే తారీఖు వేసి నేను క్షేమం అన్న ఒకే ఒక ముక్క రాసి అంటించేసాను. అది చూసుకుంటేగా. మామూలుగా పోస్టు చేస్తోంది. నాన్నగారు ఆ వుత్తరాలు చూసి అక్కయ్య కేమైందోనని పరుగెత్తికెళ్లారు. అప్పుడు అసలు విషయం తెలిసింది. ఇద్దరం దోషుల్లా నిలబడ్డాం. నేను జరిగిన సంగతి చెప్పేసాను. నాన్నగారి ముందు దొంగతనం బైటపడిపోయిన అక్కయ్య సిగ్గుపడి యిప్పుడు తనకితనే రాసుకుంటుంది.

అక్కయ్యలాటివాళ్ళు అసలు వుత్తరాలే రాయరు. ఒకవేళ రాసినా మూడు ముక్కలు రాస్తారు. తీరిపోతుంది.

యద్దనపూడి సులోచనారాణి

అలాటివాళ్ళతో పేచీలేదు. కాని కొంత మంది మామయ్యలాటి వాళ్ళున్నారు. వాళ్ళకి అందంగా, తీరిగ్గా పెద్దవుత్తరం రాయాలని వుంటుంది. కానీ తీరదు. వుత్తరం రాయటానికి మామయ్య పడే అవస్థ చూస్తే నవ్వొస్తుంది. అసలు వుత్తరం రాయటానికి ఓవారంరోజులు ముందరే వుత్తరం రాయాలీ వుత్తరం రాయాలీ అని మొదలెడ్తాడు. అలాఅన్న యే వారం పదిరోజులకో ఓ కవరు తీసు కొస్తాడు. దానిమీద అడ్రస్‌రాసేసి (లేక పోతే నాలాంటివాళ్ళు తీసేసుకుంటారని ఆయనకి భయం) యే పరుపుక్రిందో, టేబిల్‌క్లాత్ అడుగునో పెడ్తాడు. అలా పెట్టిపెట్టి ఓ శుభముహూర్తాన ఓ పెద్ద కాగితం తీసుకుని శ్రీరామా అని రాసి సంభోధన రాస్తాడు. ఇంతలో యెవరో వస్తారు. అది యే పుస్తకంలోనో పెట్టి దానిమాటే మర్చిపోతాడు. మళ్ళీ యెప్పుడో గుర్తొచ్చినప్పుడు వెదు క్కుంటె ఆ పుస్తకం మారటమో—లేక అందులోవున్న వుత్తరాన్ని తీసి యెక్కడైనా పెట్టెయ్యటమో జరిగిపోతుంది. సాధారణంగా వుత్తరం మీద ఆయన వేసిన తారీఖుకి దాదాపు పదిహేను, 20 రోజుల తర్వాత అది చేరవలసినవాళ్ళకి చేరుతుంది. అలా మామయ్య వుత్తరం రాయటం అంటే ఓ పెద్దకధ.

అసలు వుత్తరాలు రాయని ప్రబుద్ధుల మాట అటైతే ఇహ మాటిమాటికి రాసే మహాశయుల సంగతి. వీళ్ళ వుత్తరాల్లో సవాలక్ష తప్పులుంటాయి. వాళ్ళురాసే వాటిల్లో అంతఘోరమైన తప్పులుంటా యంటె అది వాళ్ళ నిర్లక్షమో, లేక తెలియని తనమో అర్ధంగాదు. మా పక్కింటావిడకి ఓసారి పూనానుంచి అల్లుడు వుత్తరం రాసాడు. ఆ అల్లుడంటే యీవిడకి బోలెడంత గొప్ప. ఆయన గొప్పని గురించి అడక్కుండానే అంద రికీ చెబ్తూవుంటుంది. ఓసారి సాయత్రం పూట ఆయనదగ్గరనుంచి వుత్తరం వచ్చింది. ఆవిడకు సరీగ్గా చూపుఆనదు. అందుకని నన్నుపిల్చి చదివిపెట్టమన్నది. తీరాచూద్దుకదా మొదట్లో గంగాభగీరధ సమానురాలయిన ప్రియాతి ప్రియమైన అత్తగార్కి అని వుంది. ఆవిడ సువా సిని. ఆ వాక్యం వదిలి మిగతాది చదివి విన్పించాను. అందులోగూడ బోలెడన్ని తప్పులు. వెధవ గ్రాంధికం ఆయనాను. ఉత్తరం నాకు చించెయ్యాలనిపించింది. కాని వూరువెళ్ళినవాళ్ళ ఆయనకోసం ఆవిడ భద్రంగా దాచిపెట్టింది. తర్వాత వాళ్లు అది చూసుకుని యేమనుకున్నారో మరి.

ఉత్తరం రాసేటప్పుడు లోపలి విష యంకంటె సంబోధన, మొదలుపెట్టే తీరు, ముగించే వైనం ముఖ్యం. వుత్తరం రాయటం అందరికీ రీతిగా వుండకూడదు. ముఖ్యంగా పెద్దవాళ్ళకి రాసేటప్పుడు సంభోధన చాలా గౌరవ

సూచకంగా వుండాలి. చివర యిట్లు విధేయుడు అనో లేక మీ ఆశీర్వచనములు కోరుతూ అనో వుంటే బాగుంటుంది. అంతేగాని హలో, హౌ డు యూ డు అని మొదలుపెట్టి బామ్మా బై, బై, తాతయ్యా టా, టా అని ముగిస్తే కొంచం అతిగానే వుంటుంది.

సమానవయస్కులకి మిత్రులకి రాసేటప్పుడు యెలా రాసినా బాగానే వుంటుంది. స్నేహితులకి వ్రాసే యీ వుత్తరాల్లో మనం అంటే యేమిటో స్పష్టంగా కన్పిస్తూంటుంది.

ఉత్తరాలు రాసేవాళ్లు యెన్నిరకాలో, రాయబడే వుత్తరాలుగూడ అన్నిరకాలు. పెద్దవాళ్లు చిన్నవాళ్ళకి రాసేవాటిల్లో కొంచం, అధికారం, ఆప్యాయతగూడ మిళితమై వుంటాయి. చిన్నివాళ్లు పెద్దవాళ్ళకి రాసేవాటిల్లో వినయం, చనువు కన్పిస్తాయి.

సహజంగా వుత్తరాలు రాసినవ్యక్తికి, రాయబడినవ్యక్తికీ సంబంధించినట్లుగా పరిమితమై వుంటాయి వాటిల్లో యితర్లకి యేమీ ఆసక్తి వుండదు కాని కొన్ని వుత్తరాలున్నాయి. అవి అలాగాదు — రాసినవ్యక్తికి — రాయబడినవ్యక్తికీ కాక కొన్ని తరాలకి—యుగాలకి చిహ్నంగా నిలిచిపోతాయి. నెహ్రూజీ యిందిరా గాంధీకి, చలం దీక్షితులకి రాసినవి యీ కోవకి చెందుతాయి

ఉత్తరాలన్నిటిలోకి వున్నతమైనవి— చాలా సున్నితమైనవి ప్రేమలేఖలు అని చెప్పొచ్చు. ఇవి రాసేటప్పుడు మనిషి యెంత ఆనందాన్ని అనుభవిస్తాడో చదువుకునేటప్పుడు గూడ అవతలవ్యక్తి సరీగ్గా అలాగే అనుభూతి పొందుతాడు. కాని యే కారణాల చేతనైనా యివి యివతలకు వచ్చాయా వాటంతటి అసహ్యమైనవి జుగుప్సాకరమైనవి యింకోటి వుండవు. చాలా భయంకరమైన విషయం యిది సిల్వియా వుత్తరాలు యిలాటివే కదా మరి.

ఎక్కడోగాని, సామాన్యంగా రచయిత లందరూ మంచి మంచి వుత్తరాలు రాస్తారు. స్వీయ రచనల్లోకంటే యీ వుత్తరాల్లో రచయిత అసలురూపం తెలుసుకోవచ్చు ఈ విషయం శరత్ లేఖల్లో స్పష్టమౌతుంది.

ఏది యెలాఅయినా వుత్తరం రాస్తే అది రాసేటప్పుడు మనిషి యెలా అనుభూతి పొందాడో చదివేటప్పుడుగూడ సరీగ్గా అలాటి అనుభూతే పొందాలి. వుత్తరం చదవటం మొదలుపెట్టగానే క్షణంసేపు మనం వున్న పరిసరాలు మర్చిపోయి అందులో కల్పింపబడ్డ వాతావరణంలో కరిగిపోవాలి అదీ నిజమైన వుత్తరం.

నామటుకు నాకు యేమీ తోచకపోతే హాయిగా యే మూలనైనా కూర్చుని యెవరికైనా వుత్తరం రాస్తాను. ★




చూపు లో చూపు

# ఆర్థికంగా స్త్రీ

—రమాదేవి—

స్త్రీకి సంపూర్ణ హక్కులుగల ఆస్థి భాగాన్ని స్త్రీ ధనం అన్నారు అయితే ఈ ధనం స్త్రీకి ఎలా లభిస్తుందీ అంటే పలువురు పలురకాలుగా చెప్పారు. కొందరు దానిని విస్తృత పరచి చెబితే, మరికొందరు కుదించి, తగ్గించి చెప్పారు. ముఖ్యంగా చెప్పుకోదగ్గవి ఏమిటంటే కన్యాశుల్కం ; పెండ్లికి ముందు పెండ్లి సమయంలో, పెండ్లి అయినవెంటనే అత్తమామలు ఇచ్చే కానుకలు ; తల్లి, తండ్రి, అన్నలు ఇచ్చే కానుకలు ఇవన్నీ కలిసి స్త్రీ ధనంగా రూపొందుతాయి అన్నారు మనువు మొదలైనవారు. తరువాత తరువాత వీటికి మరికొన్ని చేర్చబడ్డాయి వివాహానంతరం అత్తింటి తరపు బంధువులు, పుట్టింటి తరపు బంధువులు ఇచ్చే కానుకలు, భర్త మరొక భార్యను చేపడదామనుకున్నప్పుడు మొదటి భార్యకు తన ఇష్టాన్ననుసరించి, ఇచ్చేడబ్బు ; బంధువులు, కొడుకులు ఇచ్చే కానుకలు, భర్త పెట్టే నగలు; భర్త తనతిండి నిమిత్తం వెచ్చించే మొత్తం ఇవన్నీకూడా స్త్రీ ధనం క్రిందికే వస్తాయన్నారు ధర్మశాస్త్రవేత్తలు.

స్త్రీ స్వశక్తితో సంపాదించే డబ్బు, పెండ్లి తరువాత ఎవరైనా పరాయివారు తనకు కానుకలిస్తే, అవీ స్త్రీ ధనం క్రిందకు రావు అన్నారు కాత్యాయనుడు మొదలైనవారు. అయితే ఈ నిబంధనలు రెండూ పురుషుల మనస్తత్వాన్ని; సాంఘిక పరిస్థితుల్ని గమనంలో ఉంచుకొని ఏర్పరచారేకాని, స్త్రీకి అన్యాయం చేయడానికి కాదు అని పెద్దల అభిప్రాయం. ఎవరో పరాయివాళ్ళు వచ్చి తనభార్యకు కానుకలివ్వడం భర్త సహించ లేకపోవచ్చు, అతనిలో ఏవో అనుమానాలు మొదలయి ఇల్లే నరకంగా మారవచ్చు. అందుచేత అలాంటివాటిని అరికట్టడం కోసం ఆ నిబంధన ఏర్పడింది. ఇకపోతే స్త్రీ కష్టార్జితం విషయంలో, ఆనాటి సాంఘిక వాతావరణం ఎలా ఉండేదంటే స్త్రీలలో కేవలం కూలి జనం మాత్రమే బయటకు పోయి కష్టపడి సంపాదించడం ఉండేది. వర్ణాశ్రమధర్మాన్ని నిష్ఠగా ఆచరించే ఆ రోజుల్లో పైమూడు అగ్రవర్ణాలస్త్రీలు

బయటకుపోయి కష్టించి ఆర్జించడమనేది ఉండేది కాదు. అలాంటప్పుడు వారికి కష్టార్జితం అన్న ప్రశ్నే ఉండేదికాదు. కూలీజనంలో మాత్రం స్త్రీ కష్టార్జితాన్ని కూడ ఇంట్లో వాడవలసిన అ గ త్య ం ఎంతైనా ఉంటుంది భర్త, భార్యా, పిల్లలు అందరూ కష్టిస్తేనే క డు పు నిండేది అలాంటప్పుడు స్త్రీ తన కూలీ డబ్బుని 'ఇది నా స్వంతం, దీనిని ఇంటి క్రింద ఖర్చుపెట్టను' అనడంలో అర్థం లేదు ఇక్కడ స్త్రీ, పురుషుల మధ్యన ఆర్థిక న్యాయంఏదో తలఎత్తేది, సాంఘి కంగా ఒక వర్ణానికి, ఒక వర్ణానికి మధ్య, ఆర్థికంగా గొప్ప బీదలమధ్య ఏర్పడిన అఖాతాలు ఇంతవరకూ బాగానే ఉంది స్త్రీ కూడ కష్టించి కుటుంబాన్ని పోషించాలి ఆ డబ్బును తనకు ప్రత్యే కంగ దాచుకోగూడదూ అన్నప్పుడు పురుషునికి కూడ అలాంటి బా ధ్య తే ఉంది కదా' పురుషుడు కూలీ డబ్బులు ఇంటిలో ఇవ్వక తాగి త ం ద నా లా డి ఇంటికి వస్తే, చచ్చినట్టు భార్యే కుటుంబ భారాన్నంతా వహించవలసి వ చ్చే ది భర్తదగ్గఱనుంచి న్యాయబద్ధంగా డబ్బుని రాబట్టే అవకాశం భార్యకి కలిగించలేదు ఆమెకు ఆ వర్గానికి చెందిన స్త్రీ ల కు ఆర్థికంగా అన్యాయం జరిగిందనే విష యాన్ని ఒప్పుకు తీరాలి

ఏడవ శతాబ్దంనుంచి స్త్రీ ధ నా ని కి ప్రాముఖ్యం హెచ్చింది 'స్త్రీ చేతిలో ఉన్న ఏరకమైన ఆస్థి అయినా స్త్రీ ధనం క్రిందకే వస్తుంది' అన్నాడు విజ్ఞానేశ్వర్. అయితే ఈయనతో అందరూ ఏకీభవించ లేదు. 'వారసత్వం వల్ల లభించిన ఆస్థి, భాగాలు పడడంవల్ల సంక్రమించిన ఆస్థి స్త్రీ ధనం క్రిందకు రావు' అని తీర్మా నించారు ప్రీవీకౌన్సిలు న్యాయమూర్తులు అంతేకాకుండ మరొక కేసులో 'తల్లి ఆస్థినుంచి వారసత్వంగ వచ్చిన ఆస్థి భాగం కూడా స్త్రీ ధనం కాదు' అన్నారు ఒక్క బొంబాయి హైకోర్టు న్యాయ మూర్తులు మాత్రం అది స్త్రీ ధనం క్రిందకే వస్తుంది అన్నారు వి త ం తు వు ల కు ల భి ం చే చరాస్థి స్త్రీ ధనం అన్నారు కొందరు న్యాయనిబంధనలు ఎలాఉన్నా వారి సాంప్రదాయం ఒప్పుకుంటే స్త్రీకి వారసత్వంవల్ల లభించే ఆస్థి స్త్రీ ధనం క్రిందకే వస్తుందన్నారు అ ల హా బా ద్ హైకోర్టు న్యాయమూర్తులు జైనమతానికి చెందిన స్త్రీలకు భర్తనుంచి వారసత్వంగ వచ్చిన ఆస్థిలో స ం పూ ర్ణ హ క్కు లుండేవి వీటన్నింటినిబట్టి చూస్తే న్యాయ నిబంధనల్ని దే శ ం న లు మూ ల లా అందరూ ఒకేవిధంగా ఆచరించలేదు. సాంఘికాచారాలకు, ఆయా న్యాయశాస్త్ర వేత్తల అభిప్రాయాలకు కూడ చా లా ప్రాముఖ్యత ఉండేదని తెలుస్తోంది

ఒక్క వాక్యంలో చెప్పాలంటే స్త్రీ ఆస్థి రెండు రకాలు స్త్రీకి ముద్దుముచ్చటల రూపంగ వచ్చిన కానుకలు, స్త్రీ పరంగా

లభించిన ఆస్థి ఒకటి, పురుషపరంగా భర్తతరపునుంచి వచ్చిన ఆస్థి రెండవది. మొదటిది స్త్రీ ధనం దానిపైన స్త్రీ కి సంపూర్ణాధికారం, హక్కులు ఉన్నాయి రెండవదానిలో తగుమాత్రం అధికారం హక్కులూ మాత్రమే ఉన్నాయి

ఇక ఈ స్త్రీ ధనంపైన తనకుగల సంపూర్ణ హక్కుల్ని, అధికారాన్ని స్త్రీ వినియోగించుకోడానికి ఎలాంటి అవకాశాలుండేవో చూద్దాం మనువు అన్న దేమిటంటే భర్త అనుమతి లేనిదే భార్య తన స్త్రీ ధనాన్ని కూడ తన ఇష్టంవచ్చినట్టుగ పంచి ఇచ్చుకోవడానికి, వినియోగించుకోవడానికి వీలులేదు అని ఆయనే అన్నారు మరో మాటకూడ, గడ్డురోజులలో తప్పితే భర్త భార్య స్త్రీ ధనాన్ని ముట్టుకోగూడదూ అని అలా ఒకవేళ చేస్తే భర్త వడ్డీతోసహా ఆ ధనాన్ని భార్యకు తిరిగి ఇచ్చేయాలి 'తండ్రి, సోదరుడు, బంధువు ఎవ్వరుకూడ స్త్రీ ధనాన్ని ముట్టకూడదు అలా చేస్తే ఆ డబ్బు వడ్డీతోసహా తిరిగి ఇచ్చివేయడమే కాకుండ, జరిమానాకూడ చెల్లించవలసి ఉంటుంది' అన్నాడు కాత్యాయనుడు అయితే స్త్రీయే తన ఇష్టానుసారం వారి ఆర్థిక చిక్కులను చూసి జాలిపడి తన ధనాన్ని ఇస్తే, అప్పుడు మాత్రం వారు వడ్డీ చెల్లించాల్సిన అవసరం ఉండదు తమ పరిస్థితులు చక్కబడ్డాక తీసుకున్న మొత్తాన్ని తిరిగి ఇచ్చివేస్తే చాలు భర్త తన జీవితకాలంలో భార్యకు కొంత డబ్బును కానుకగా ఇస్తానని వాగ్దానం చేసి, అది ఇవ్వకుండానే చచ్చిపోతే, కొడుకులు దానిని అప్పుక్రింద జమకట్టి ఆ మొత్తం తల్లికి ఇచ్చివేయాలి

స్త్రీ ధనం పూర్తిగ స్థిరాస్థి కాని, పూర్తిగ చరాస్థిగాని కానక్కర్లేదుగా కొంత అదీ కొంత ఇదీ ఉండవచ్చు స్త్రీకి తన ధనంపైన ఎంత సంపూర్ణాధికారం ఉందన్నప్పటికీ కొందరు న్యాయవేత్తలు స్థిరాస్థిని స్త్రీ ఇష్టమొచ్చినట్లుగ అమ్ముకోవడం, పంచడం చేయకూడదని ఆంక్ష పెట్టారు దీనిలో కొంత అర్థం ఉంది అంటున్నారు పెద్దలు సమిష్టి కుటుంబపు ఆస్థినుంచి ముచ్చటకు భర్త కొంత స్థిరాస్థిని భార్యకి ఇచ్చినట్లయితే, అది ఆవిడ తన ఇష్టానుసారం అమ్మేసుకుంటే, అసలు ఆస్థి అంతటితోనూ గొడవ ఏర్పడుతుందన్న ఉద్దేశంతోనే ఆ నిబంధన ఏర్పడిందట 'స్త్రీకి స్థిరాస్థి భర్తనుంచేకాని ఇతరంగా లభించేది కాదా' అంటే సర్వసాధారణంగా భర్త నుంచి మాత్రమే స్త్రీకి స్థిరాస్థి లభించేది...ఇది గమనంలో ఉంచుకునే తరువాత తరువాత తాతదగ్గరనుంచి మనుమరాలికి సంక్రమించే ఆస్థిని మాత్రం ఆమె ఇష్టానుసారంగా ఏదైనా చేసుకోవచ్చునని నిర్ధారించారు స్త్రీకి తన ధనంమీద సంపూర్ణ హక్కులు ఉన్నాయీ అంటూ ఇన్ని ఆంక్షలు దేనికి? ఆమెకు నిజంగా

సంపూర్ణాధికారం ఎంతవరకూ ఉందో అంత మేరకు మాత్రమే దానిని స్త్రీ ధనం అందాం అన్నాడు జీమూతవాహనుడు

అసలు స్త్రీ ధనపు విషయంలో హక్కుల్ని గురించి ఇంత తర్జనభర్జనలు ఎందుకు జరిగాయీ అంటే, స్త్రీ ధనానికి వారసు లెవరూ అన్న సమస్య ఒక టుందిగా' స్త్రీ ధనానికి వారసులు కేవలం స్త్రీలు, లేదా స్త్రీ పరంగా హక్కు కలిగిన పురుషులు ....పురుషుని ఆస్తికి అలా కాదుగా' ఆ ఆస్థికి భర్తతరపు పురుషులే వారసులు. స్త్రీ ధనానికి పూర్తి వారసులు పెండ్లి కాని కూతుళ్ళు, ఆతరువాత పిల్లలు లేని కూతురు కాని, ఆర్థికంగా బాధపడు తున్న కూతురుగాని హక్కును కలిగి ఉంటుంది కూతుళ్ళు లేనప్పుడు కొడుకు లకు హక్కు లభిస్తుంది తరవాత తరవాత వివాహ ప్రసక్తిని తీసేసి, పిల్లలు లేనప్పుడు ఆ ఆస్థి భర్తకు లభి స్తుంది అన్నారు అనాదినుంచి స్త్రీ ధనం ఆడపిల్లలకే చెందుతుందనేది నిర్వివా దాంశం అసలు మొదట్లో స్త్రీ ధనం అంటే కేవలం ఆభరణాలు, దుస్తులు మాత్రమే అందుచేత వాటిని ఆడపిల్లలు పంచుకోవడం సమంజసమే కొడుకులు తీసుకుంటే అవి వారి భార్యల ఒంటిని అలంకరిస్తాయి. తల్లి సామాన్యంగా తన దుస్తులు, తన ఆభరణాలు కోడళ్ళకంటె కూతుళ్ళు వాడుకుంటే ఎక్కువ ఇష్ట పడుతుంది కదా! అందుచేత ఆ ఉద్దేశం తోనే ధర్మశాస్త్రవేత్తలు స్త్రీ ధనానికి మొదటి వారసులు ఆడపిల్లలే అని నిర్ధారించారు

పెళ్ళికాని ఆడపిల్లలు తమ స్త్రీ ధనాన్ని తమ ఇష్టమొచ్చినట్టుగ ఖర్చు పెట్టుకోవచ్చు మైనారిటీ తీరకపోతే గార్డియన్ ద్వారా ఖర్చుపెట్టుకోవచ్చు. భర్తతో కలిసి ఉన్నప్పుడు స్థిరాస్థి విష యంలో మాత్రం భర్త అనుమతిని పొందాలి వితంతువు అయితే ఇక ఎవరి అనుమతీ అవసరంలేదు

మొత్తంమీద స్త్రీ ఆర్థిక ప్రతిపత్తి విషయంలో ధర్యశాస్త్రవేత్తలు, న్యాయ మూర్తులు మారుతున్న సాంఘిక పరిస్థితు లకు అనుగుణంగా వారి ఆర్థికావసరాలను గమనంలో ఉంచుకుని వ్యవహరిస్తూ వచ్చారూ అన్నది సుస్పష్టమవుతోంది మొగపిల్లలకు తండ్రి ఆస్థిలో హక్కులు లభిస్తే, ఆడపిల్లలకు కనీసం తమ తల్లి స్త్రీ ధనంలోనైనా హక్కు లేకపోతే ఎలా అన్న ఉద్దేశంతోకూడ వారు వ్యవహరించినట్టుగ తోస్తుంది. అయితే హిందూ సంఘంలో పురుషుడు 'మగ మహారాజుగ' వ్యవహరించడం ఆచా రంగ వచ్చింది కనుక ఎక్కువ అవకా శాలు, ఎక్కువ హక్కులు అతనికి లభించాయి అలాగే స్త్రీ ఆర్థికావసరాల్ని పూర్తిగ విస్మరించకుండ ఏదో ఇలాంటి అవకాశాలు కొన్ని కల్పించారు మన పెద్దలు

# ఒక వాన రోజున మా ఇంట్లో

నందగిరి ఇందిరాదేవి.

నిజానికి ఏదో అక్కయ్యగారు అతి ఆప్యాయంగా అడుగుతున్నారు కనుక కాని లేకపోతే మా యిల్లు కురుస్తుందని కాని, మా వారికి కోపం ఎక్కువ అని గాని ఎవరితోనూ చెప్పుకోవాల్సిన విషయాలు కావు అవి బట్టకింది తొడపాశం లాగా అనుభవించాల్సిందే రోజూ జరుగుతున్న ఆ విషయాలు చెప్పినా ఎట్లా ఉంటుందంటే ఒకసారి ఒక గారాబాల అబ్బాయి రైలు ప్రయాణం చేస్తున్నాడట తండ్రి పాపం ఆదుర్దాగా రైలెక్కినప్పటి నుండి వివరాలన్నీ వ్రాయమన్నాడట ఇహ అబ్బాయి ఉత్తరం రాస్తూ "వంతెన వచ్చింది రైలు గడా గడా గడా గడా గడా" అని మొదలు పెట్టాడు ఆ గడా గడా ఎన్ని పేజీలు వ్రాసినా మైలు పొడుగు వంతెన ఎంతకీ దాటటంలేదు రైలు అట్లాగా నాలుగు నెల్లు వానకాలం మా యిల్లు కురిసీ కురిసి కురిసి అని మొదలు పెట్టితే ఆ అబ్బాయి ఉత్తరంలాగా వుంటుంది

అసలు వానే బేజారుగా ఉంటుంది ఆ సంగతి తల్చుకుంటేనే చికాకు నిజంగా చిన్నప్పుడు వానలో తడుసుకుంటూ నీళ్ళలో కాగితంపడవలు వొదులుకుంటూ, 'వానాలు కురియాలి వరిచేలు పండాలి మా నాన్న తేవాలి_మా అమ్మ వండాలి' అని పాడుతుంటే బలే కుషీగా ఉండేది. ఈ సాధక బాధకాలు అప్పుడేం తెలిసేవి గావుగా'

వానాలు కురవటం వరిచేలు పండటం మాట ఎట్లావున్నా వానాలు కురవటం మా యిల్లు కురవటం మాత్రం నిజం మరిట ఒకసారి ఇద్దరు సర్దారులు ఒక ఉదయంపూట సూర్యభగవానుని చూచి, ఒకరు చంద్రుడని, కాదు సూర్యుడని తగాదా పడ్డారట. ఆ తగాదా కొట్టుకోటం వరకు వచ్చేసరికి మూడోవాణ్ణి అడిగి తేల్చుకుందాం అని దారిబడిపోతున్న మరొక్క సర్దారుని అడిగారట సూర్యుడా చంద్రుడా అని ఆయనన్నాడట "ఏమో బాబూ నే నీ వూరికి కొత్తగా వచ్చాను.

నాకూ తెలియదు'' అన్నాడు. ఎందుకు చెప్పానంటే అటువంటి అనుమానం ఏ కోశాన లేకుండా రవి సుధాకరు లున్నన్ని రోజులు మా యిల్లు ఉరవట మనే నగ్నసత్యాన్ని మీ రెవ్వరూ గుర్తించక పోవచ్చు ఇంకో విషయం ఏమిటంటే మా ఇల్లు గలాయిన చెప్పి నట్టు, "ఇల్లు బాగుచేయించండి బాబూ" అని కడుపులు కాళ్ళు పట్టుకు బతిమాలు కుంటే ఆయన "అమ్మాయ్! మీ యిల్లు ఒకటేకాదు ఈ వాడలో ఇళ్ళు అన్నీ ఇట్లాగే ఉన్నాయి ఈ వాడలోనే కాదు ఈ దేశంలో ఇళ్ళతీరే అంత" అంటాడు అట్లా వాడలకు వాడలు దేశాలకు దేశాలే నీళ్ళు కారిపోతుంటే మా ఒక్క యిల్లు కురిసిందని చెపితేమాత్రం ఎవరి కేం లెక్క చెప్పండి!

ఇప్పుడింత తాపీగా చెపుతున్నా కాని వాన పడేవరకుమాత్రం నాకు నిజంగా వెర్రెత్తి పోతుంది వెర్రెత్తిస్తారు ఇంటిల్లిపాది పాలవాడు గేదెను తీసుకు రాడుగదా, సగంనీళ్ళు సగంపాలు కలిపి చేతిపాలు పోయటంతో ఆరంభం ఘర్షణ ఇట్లా నీళ్ళుపోస్తే ఎట్లా అని అరచి కోప్పడితే "బర్రె, నీళ్ళు శానాతాగింది. నేను నీళ్లసుక్క కలిపితే ఒట్టు" అంటాడు చమత్కారంగా

పొద్దున్నే అసలే హడావిడి_అందులో వాన.చకచకా తెమిలిపనిచేసుకోకుండావాన పడేవరకు ప్రైవేటు టీచరు దగ్గరనుండి పనిమనిషివరకు అంతా నాగాలే వేస్తారు వానవస్తుందేమో అనుకొని ప్రైవేటు టీచరు రాకపోతే, సాక్షాత్తు పడుతుంటే పనిమనిషి ఎట్లా వస్తుంది చెప్పండి ఇంట్లోనేఉన్న పనికుర్రాడు కూడా ఆ రోజు గరాజులోంచి బయటికిరాడు ఏమిటిరా అంటే గజగజ వణుక్కుంటూ ''నాకూ జరం" అంటాడు ఇద్దరి పని నెత్తిన పడుతుందన్న భయంతో వాళ్ళంటే తప్పించుకోగలరుకాని మన కెట్లా తప్పుతుంది? పిల్లలంతా లేచి గోల_ఒకరికి కాఫీ ఒకరికి వేడినీళ్ళు_ వాన అని అరగంట ఆలస్యంగా లేచే వరకు అంతా upset_అయిపోతుంది గబగబా వంటిల్లు శుభ్రంచేసుకుని ఆరాత్రి అంట్లన్నీ పక్కకునెట్టి పొయ్యి అంటిద్దామంటే అదీ స్ట్రైకు కట్టెలు మండవు బొగ్గులు అంటుకోవు. మొదటే చెప్పాగా తడవని భాగంఅంటూ లేదని ఒకసారి అయితే ఇల్లువొదిలి పారిపో వాల్సి వచ్చింది బయట వాన వెలిసినా ఇంట్లో వెలవదాయె వాన! ముసుర్లు తగ్గాక వచ్చి చూస్తే లా పుస్తకాలు, కామెంటరీలు, డైజెస్టులు అన్నీ నీళ్ళలో ఈతకొడుతున్నాయి రెండుమూడు వేల రూపాయిల లైబ్రరీ అంతా పాడయి పోయింది ఆ యేడు మళ్ళీ ఆ అద్దాయి ఉత్తరం లాగానే కురవటం సంగతే దొర్లింది.



"స్పెషల్ కాఫీకి మామూలుకాఫీకీ తేడా ఏమిటి?"

"రెండణాలు."

ఈ వాన — ఉరుపు — పనిమనిషి రాక పోవటం, కట్టెలు మండక పోవటం ఈ అవస్థంతాపడి తనకూ పిల్లలకూ ఓ కూర, అన్నం అయినా చేద్దామని తొందర పడుతుంటే మా దొరగారు ఎనిమిదింటికి లేచి, బొంగరంలాగా తిరుగుతున్నానని, నా నోటికి విరామం లేదని, నా గోలకి తనకు నిద్రేపట్టలేదని రిమార్కులు. పోనీ అంటేఅన్నారు, నాపని సక్రమంగా చేసుకోనిస్తారా అంటే అదీలేదు తేప తేపకు పిలవటం—సిగరెట్టుపెట్టి అందిం చడంకోసం అగ్గిపెట్టికోసం—మంచంకింద ఉన్న స్లిప్పర్లే కనబడవు వారికి ఒక్కొక్క సారి ఇహ బాత్‌రూంలో ముఖం కడుగు కుంటూ కూడా పనులు పురమాయిస్తారు. ఇంట్లో కూడా ఎన్నో Personal files ఓ క్లర్కుకు ఉన్నంత పని ఉంటుంది. చెప్పినపనులు మర్చిపోయ్యానన కుండా కాగితం పెన్సిలు తెచ్చుకుని నోటు చేసుకోమంటారు నంబరు 1 ఫలానా యిన్సూరెన్సు కంపెనీకి పాలిసీ రెఫరెన్సు ఇస్తూ రసీదు పంపలేదు అని ఒక లెటరు అర్జంటు ఇవ్వాళ డిస్పాచ్ కావాలి నంబరు 2 కారు స్టార్టింగులో

ట్రబులిస్తున్నది. కార్ఖానాకు తీసుకెళ్ళాలి. నంబరు 3. బ్యాంకుకువెళ్ళి మానేజరును కలిసిరావాలి—ఎందుకంటే ... ఒకటి... అని ఇంకా చెపుతుంటే "వంటింట్లోంచి మాడువాసన వస్తోంది ఇప్పుడే వస్తా"నని పరుగెత్తి చూద్దును గదా పొయ్యిమీది అన్నం నానబాలయి కూచుంది కుంపటి మీది కూర మాడి మసిబొగ్గు అయింది. ఆ కూరదించి ఈ అన్నంకింద మంట బెడుతుంటే చంటివాడు కాంపోజిషను దిద్దమంటాడు అబ్బ నిజంగా అష్టావధాన మనుకొండి.

పడేవాన పడుతూనే ఉంది ఇంకా పాచియిళ్ళు ఊడ్చుకోలేదు చాకలివాడు తయారు బట్టలెయ్యమని నాయనా నీకూ ఇప్పుడే తీరిందా అనుకొని వచ్చినవాడివి వచ్చావు కాని కాస్త ఇళ్ళు ఊడవమన్నా ఇంతలో పిల్లలంతా బూట్లు బట్టలు వేసుకున్ని తయారయ్యారు పోనీ ఈ పూట వెళ్ళకపోతే ఏమర్రా అంటే ఒకడు టెస్టు ఉందంటాడు ఇంకోడు రిపోర్టు ఇస్తారంటాడు ఇహ అమ్మాయయితే సరేసరి పిడుగుపడ్డా వెళ్ళాల్సిందే N C C కాబట్టి ఇహలాభం లేదనుకొని ఆ ఉడుకు మిడుకు అన్నంలో ఇంత ఆవకాయ కందిపొడి కలిపి నలుగురికీ నాలుగు ముద్దలుపెట్టి పంపించేవరకు ఒక ఘట్టం ముగిసింది మా యింట్లో ఆ వానరోజున

కాస్త ఊపిరి తీసుకొనేవరకల్లా గేటుముందర టాంగా ఆగింది మా దూరపు బంధువూ ఆమెకూతురు దిగారు కూతురును అత్తవారింటికిబొంబాయికి పంపిస్తూ దారిలో దిగారన్నమాట ఇక్కడ కూతురుపసిపిల్లతల్లి ఆవిడకు తగని ఆచారం మడి వాళ్ళను చూడగానే గుండె ఆగినంత పని అయింది కుశలప్రశ్నలు కాగానే రైల్లో తడిసిన పసిపాపబట్టలన్నీ పిండి ఇంటినిండా పద్దాల్లాగా కట్టారు తల్లీ కూతుళ్లు

'దోసెడు కొంపలో పగుల ద్రొక్కుడి మంచము, దూడరేణువున్—బాసినపంట కాలు - పసిబాలుర శౌచము - మాసిన గుడ్డలు' అని శ్రీనాధుడు వ్రాసిన పద్యం జ్ఞాపకం వచ్చి బోరున జడివాన కురియ లేదు కాబోలు ననుకున్నాను

మరి ఇహ వారుచెప్పిన పనులన్నీ నేను చేశానా ?

వచ్చినవాళ్ళకు భోజన సదుపాయాలు అమర్చానా ?

అన్నింటికంటె ముఖ్యం మావారి కారు స్టార్టయిందా చక్కగా ? ఈ ప్రశ్నలకు జవాబులు వెండితెరమీద చూడక్కర్లేకుండా ఎట్లాగో అవస్థపడి అన్నీ లక్షణంగా అమర్చానని నేను చెపుతూ ఈ వాక్చిత్రాన్ని ఇంతటితో ముగిస్తే మీకూ నాకూకూడా తెరిపి

సెలవు

# ప్రశ్నావేదిక

కుమారి అంబటి దేవకి, అలహాబాదు

పరుల సొత్తును పగిలిన కుండ ముక్కలవలె భావించాలంటే మానవుడేం చేయాలి?

పగిలిన కుండముక్కలను తనసొత్తుగా భావించటం నేర్చుకోవాలి.

*　　　　*　　　　*

జి. నాగేశ్వరరావు, హైదరాబాదు

ఈనాడు స్టాలిన్ కృశ్చేవ్ యొక్క తీవ్రమైన విమర్శకు గురవుటకు కారణమేమిటి?

పరిస్థితుల్లో వచ్చిన మార్పే స్టాలిన్ ఉన్నరోజుల్లో రష్యాలో వున్న ప్రభుత్వం సుస్థిరం కాకపోవటంవల్ల, ప్రపంచంలో రష్యా ఏకాకిగా వుండటంవల్ల, రష్యాప్రభుత్వాన్ని కూల ద్రోయటానికి పాశ్చాత్య దేశాలు పూనుకోవటంవల్ల ఆయన వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ప్రోత్సహించలేకపోయాడు. రష్యా ప్రజల నందరినీ ఏకోన్ముఖులను చేయవలసిన అవసరం ఆనాడు ఆయనకు కలిగింది. అంటే రష్యాదేశాన్ని ఒక యుద్ధ శిబిరంగా తయారుచేస్తే తప్ప ఆ దేశంయొక్క మనుగడకు ఆస్కారంలేని పరిస్థితి అది. ఆ పరిస్థితికి అనుగుణంగా నడిచాడు స్టాలిన్

ఈనాడు రష్యా పరిస్థితులు, ప్రపంచ పరిస్థితులు మారినై. చైనావంటి ఒక పెద్దదేశం కమ్యూనిష్టు ప్రభుత్వ అధీనంలోకి వచ్చింది. మనదేశం వంటి అనేకదేశాలు సోషలిష్టు ఆదర్శాల్ని సాధించడానికి నడుం కట్టినవి. ఈవిధంగా ప్రపంచ పరిస్థితులు స్టాలిన్ రోజుల్లో కమ్యూనిజానికున్నంత వ్యతిరేకతగా లేవు.

రష్యాకూడా అన్నివిధాలా అభివృద్ధి చెందివుంది. ఆ కారణంగా యితర దేశాలను చూసి, భయపడవలసిన అవసరంకూడా దానికి స్టాలిన్ రోజుల్లో ఉన్నంతగా యిప్పుడు లేదు.

పరిస్థితులు మారటం వల్ల కృశ్చేవ్ హయాంలో వ్యక్తి స్వాతంత్ర్యానికి, మానవుని హక్కులకు ప్రాధాన్యత కలిగిన అవకాశం ఏర్పడింది. ఈ మారిన పరిస్థితులకు అనుగుణంగా యిప్పుడు కృశ్చేవ్ ప్రవర్తిస్తున్నాడు.

ఇక స్టాలిన్‌ని కృశ్చేవ్ తీవ్రంగా విమర్శించడం ఎందుకంటారా? బోల్షవిక్ పార్టీ అధికారంలోకి వచ్చినప్పుడున్న పరిస్థితులు క్రమక్రమేణా మారుతూ వచ్చినా—ఆమార్పు కనుగుణంగా స్టాలిన్ ప్రవర్తించలేదని కృశ్చేవ్ అభిప్రాయం. మొదటి రోజుల్లో అవసరమైన నిరంకుశపాలన తరువాత—తరువాత అవసరంలేకుండా పోయింది. అయినప్పటికీ స్టాలిన్ మారలేదు. మొదటి పద్ధతినే ఏమాత్రం సడలించకుండా చివరివరకు అనుసరించాడు. స్టాలిన్‌మీద పూజ్యభావమున్న వ్యక్తులు ఈనాటికీ అదే విధంగా ప్రవర్తిస్తున్నారు. ఈ ప్రవృత్తిని సడలించడానికిగాను కృశ్చేవ్ స్టాలిన్‌ని తీవ్రంగా విమర్శించుతున్నట్టు నేననుకుంటున్నానండీ.—

* * *

నాంపెల్లి హన్మంతు, నిజామాబాద్.

అనుకూల దాంపత్యాన్ని దేనితో పోల్చవచ్చును?

పందిరిని అల్లుకున్న లతతో పోల్చవచ్చునండీ. లత లేకుండా పందిరి రాణించదు. పందిరి లేకుండా లత అల్లుకోలేదు. కాని వ్యక్తిత్వం దానికున్నప్పటికీ ఒకదానిమీద ఒకటి ఆధారపడి రాణిస్తాయి.

* * *

ఎ. హనుమంతురెడ్డి, ఇందుర్తి

వ్యక్తి**త్వం** యొక్క విలువ ఎంతవరకు?

ఐకమత్యానికి రూపురేఖలు దిద్దేవరకు.

*శీలా నరశింహవర్మ, నిజామాబాదు*

మగువ మనస్సు ఎలాంటిది ?

ఇష్టం ఉన్నవారికి యింద్రధనస్సు లాంటిది, ఇష్టలేనివారికి ఊసరవెల్లి లాంటిదీనూ.

*            *            *

*యస్. ఆర్. గుళ్లపల్లి, హైదరాబాదు*

కాళిదాసు కవితకూ, షేక్స్పియర్ రచనకూ గల తారతమ్యమేమిటి ?

ఇద్దరూ ప్రతిభావంతులేనండీ. అయితే పాశ్చాత్యులకు ప్రకృతితో మనకున్నంత సాన్నిహిత్యం లేకపోవడంవల్ల షేక్స్పియర్ కాళిదాసు కంటే ఒకవీసం తరుగుగానే కనిపిస్తాడు. కాళిదాసు పాత్రలవలె అతని పాత్రలు ప్రకృతిలో కలిసిమెలిసిపోవు. ఆయనకు అలా కలిసిమెలిసి పోవాలనే ఉద్దేశం ఉన్నప్పుడు కూడా అవి ఎంతో కొంత విడిగానే వున్నట్లు కనిపిస్తాయి. అంతేకాదు కాళిదాసులో ఉన్న లాలిత్యం షేక్స్పియర్ లో కనబడదు. కాళిదాసుపాత్రలు ప్రకృతిలో భాగాలుగా కనిపిస్తాయి. షేక్స్పియర్ పాత్రలు ప్రకృతిని వర్ణిస్తాయి.

*            *            *

*పి. యస్. హెచ్, వేములవాడ*

జూన్ యువలో ప్రచురించిన "గురునానక్" వ్రాసినవారు మన రాష్ట్రపతి యస్. రాధాకృష్ణన్ అని నేను, కాదని నా మిత్రుడును వాదించుకుంటున్నాము. మీరెవరితో ఏకీభవిస్తారు?

మీతోనేనండీ....

*            *            *

*అక్షయపాత్ర రాజేంద్రబాబు అలహాబాదు.*

'ఆడవాళ్ళ మాటలకు అర్థాలు వేరులే' ఈ మాట ఎంతవరకు నిజం?

పురుషులు తమ్ముతాము పరిశీలించుకున్నంత వరకూ.

*            *            *

కె. శ్రీరామ్, గుంతకల్లు

అన్ని హంగులూ ఉన్న 'యువ' లో సినిమావార్తలు లేకపోవటానికి కారణమేమిటండీ?

యువ మాసపత్రిక అవటం

*　　　*　　　*

కుమారి రుద్రి శ్యామాయిని, అంహాబాదు

మన ఆదర్శాల పట్ల మనం ఎలా ప్రవర్తించాలి?

భార్యపట్ల భర్త, భర్తపట్ల భార్య ప్రవర్తించినట్లు

*　　　*　　　*

కె. సుదర్శన్ రావు, సికింద్రాబాదు

యువ జూన్ సంచిక ముఖచిత్రంలో కొన్ని పార్టీల చిహ్నాలను తెలియ పర్చటంలో మీ అభిప్రాయమేమిటి?

రాజకీయ పార్టీలు తగవుల్లోపడి, బీదవాళ్ళను మరిచిపోతున్నా యనే ఆ ముఖచిత్రం ఉద్దేశం

*　　　*　　　*

పుత్రా వెంకటేశం, యాడికి

యవ్వనవతి అయిన స్త్రీకి శత్రువేది?

వృద్ధాప్యం



# చీకటి గదులు

సీరియల్

గోపీచంద్

ఈ విషయం ఒక సందర్భంలో కృష్ణస్వామిగారే ఒప్పుకున్నారు తన రచనలనుగురించి ఒక బ్రాహ్మణేతర కవి వ్రాసిన ప్రశంసను చదివి, "మంచికైనా చెడుకైనా, కవిత్వంలోని సౌందర్యాన్ని విపులపరచాలన్నా, మలినపరచాలన్నా—అన్నిటికీ వారే సమర్థులు మనవాళ్ళకు అదీ చేతగాదు ఇదీ చేతగాదు" అన్నారు

ఇది అక్షరాలా నిజం. బ్రాహ్మణుల మెప్పును పొందకుండా సాహిత్యరంగంలో పైకిరావటం జరిగేపనికాదు మామూలు ప్రజలు ఎందరు నోరుచేసుకొని ఏం ప్రయోజనం? వారి ప్రశంసలను వినేది ఎవ్వరు? అవి వొట్టి అరణ్యరోదనలుగానే వుండిపోతై

ఈ విషయం పసికట్టారు వెంకటరత్నం చౌదరిగారు. పసికట్టి ఈ నూతన దృష్టిని ఆచరణలో పెట్టటానికి ప్రథమ ప్రయత్నంగా కృష్ణస్వామిగారిని విమర్శిస్తూ ఒక ప్రముఖ పత్రికలో ఒకవ్యాసం ప్రచురించారు దానిఫలితం ఆయనకు వెంటనే, ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చింది

సాహిత్యరంగంలో వేత్తలుగా పరిగణింపబడిన వారి దగ్గరనుంచి అనేక వుత్తరాలు వచ్చినై అందులో, ప్రతివారూ, వెంకటరత్నం చౌదరిగారి కులమతవర్గరహిత దృష్టిని మెచ్చుకున్నారు. ఇంత విశాలదృష్టివున్న కవి మరెవ్వరూ లేరన్నారు. వెంటనే ఒక పెద్ద సన్మానసభను ఏర్పాటు చేసి, 'కవి కులాలంకార' అనే బిరుదును ప్రసాదించారు

అప్పటినుంచీ వెంకటరత్నం చౌదరిగారు పూర్తిగా కృష్ణస్వామిగారి శత్రువర్గంలో కలిసి పోయారు వారు అన్నిటికీ అతన్ని ముందుపెడుతుండేవారు అలా పెట్టటంవల్ల, ఇతరులకు తెలియకుండా కృష్ణస్వామిగారిమీద పగ తీర్చుకోవటమే కాక, తమకు కులద్వేషం లేదని నిరూపించుకోటానికి వసతి కలుగుతూ వుండేది ఇక వెంకటరత్నం చౌదరిగారికి తాము ప్రముఖ కవుల్లోఒకరుగా పరిగణింపబడే గౌరవం దక్కటం ఆనందాన్నిచ్చింది. వారు ఒకందుకు పోశారు, ఆయన ఒకందుకు తాగాడు.

సాహిత్యరంగంలో గొప్పవాళ్ళుగా పరిగణింపబడుతున్న వ్యక్తులు నిరంతరం పొగడటంవల్ల, వేంకటరత్నంచౌదరిగారిని నిజంగానే ప్రతిభగలిగిన కవి అని బ్రాహ్మణేతరులు అనేకులు నమ్మటం మొదలుపెట్టారు. ఈ విధంగా బ్రాహ్మణేతర వర్గంలోని ప్రముఖుల దృష్టి చెదరటానికి కూడా వేంకటరత్నంచౌదరిగారు, పైకి సాహితీ వేత్తలుగా కనుపిస్తూ, నిజానికి సాహిత్య రంగంలో గుత్త వ్యాపారం సాగిస్తున్న వ్యక్తులకు ఉపయోగపడ్డారు.

యదార్థం చెప్పుకోవాలంటే, వేంకటరత్నం చౌదరిగారి కవిత్వం అందం చందం లేనిది. అయితే ఏం ? కృష్ణస్వామిగారి శత్రువులు ఆ కవిత్వం నిరాడంబరమైనదనీ, నిరాడంబరత్వం లోనే నిజమైన కళ వుందనీ, ప్రచారం చేశారు అందుకు ఉదాహరణగా గాంధీజీని ప్రస్తావించారు

అయితే వేంకటరత్నం చౌదరిగారి కవిత్వంలోని నిరాడంబరతను కనిపెట్టిన ప్రముఖుల్లో నిరాడంబరంగా వ్రాసేవారు మాత్రం ఏ వొక్కరూ లేరు. అందరూ 'గజ్జెల రవళుల'ను గురించీ, 'నీలి నీలాంబరాలను' గురించీ, 'కంకణ నిక్వాణాలను'. గురించీ, 'కింకిణీ నిస్వనా'లను గురించీ వ్రాసినవారే ఇతర సమయాల్లో, ఉన్నది వున్నట్టు చెప్పటం వచనచేసే పని మాటలకు వెలుగు జిలుగులను అద్దటం కవిత్వం చేసే పని అని ఉపన్యాసాలు దంచేవారే

అయితే ఏం? ఇప్పటికీ ఇలా చెప్పటం వారికి అవసరం. దానికి కొన్ని కారణాలను పోగు జేసి ప్రజల మీదకు విరజిమ్మారు.

వేంకటరత్నం చౌదరిగారు నవ్యరీతులతోగానీ నవ్యభావాలతోగానీ పరిచయం వున్నవారు కారు అందువల్ల వారి కవిత్వం పాతఫక్కీలో వుంది, భావాలు ఊరగాయవతుగా వుంటూ వుండేవి అయితే ఏం ? 'కవికి అన్నిటికంటే ముఖ్యం నిజాయితీ ఆ గుణం ఈ కవిలో వున్నట్లుగా మరే కవిలోనూ లేదు' అని ఆ సాహిత్యవేత్తలు వ్యాసాలు వ్రాసేవారు. వేదిక లెక్కీ ఉపన్యాసాలు చెప్పేవారు. అయితే వారిలో మాత్రం నిజాయితీపరులు వొక్కరూ లేరు నిజాయితీగా వుండటం వారికొక ఆటవిక లక్షణం అయితే ఏం ? వారికి కృష్ణస్వామిగారిని కొట్టటానికి ఏ కొరముట్టయినా మంచిదే, ఈ కొరముట్టు ఉత్తమంగా కనుపించింది నిర్దాక్షిణ్యంగా ఉపయోగించారు

ఈ సంగతులన్నీ గోపాలానికికూడా తెలుసు కృష్ణస్వామిగారి కన్నా గోపాలానికి బాగా తెలుసేమో ' అందువల్ల వేంకటరత్నం చౌదరిగారు తన తండ్రిని పరామర్శించడానికి రావడం చూచి చాలా ఆశ్చర్యపడ్డాడు గోపాలం

ఇక కృష్ణస్వామిగారి సంగతి చెప్పనే అవసరంలేదు ఆయనకు తనకు ఇష్టంలేనివారితో మాట్లాడటం చేతనే చేతకాదు. అటువంటి వారిని చూడగానే ఆయన మనస్సు చటుక్కున ముకుళించుకుంటుంది. వేంకటరత్నం చౌదరిగారిని చూచినప్పుడు ఈ పనే జరిగింది

మొహం పెడగా తిప్పుకు కూర్చున్నా రాయన.

వేంకటరత్నం చౌదరిగారికి గోపాలం కూడా తెలుసు. తెలియటంలో బాగానే తెలుసు ఎంత వరకు తెలుసునంటే. గోపాలం తండ్రితో కలిసి వుండటం వారికి ఇబ్బందినే కలిగించింది



"అమ్మమ్మా కళ్ళజోడు పెట్టుకోలేదే ?"
"మీ తాత కోప్పడుతున్నారురా. కళ్ళజోడు పెట్టుకుంటే ముసిల్దానిలాగ కనపడుతున్నానట"

కృష్ణస్వామిగారితో పనులు చేయించుకోవటం గానీ, ఆయన మనస్సును లోబరచుకోవటం గానీ చాలా తేలిక. ఆయన ముందుముందు బడబడా మాటలు అంటారు. ఆ మాటలను తట్టుకొని నిలబడగలిగితే, ఆయన్ని జయించినట్లే

ఆయన కల్లబొల్లి మాటలను ఇట్టే నమ్మేస్వభావం గలవారు మనుష్యులు త్వరగా మారతారని కూడా ఆయన విశ్వాసం ఎవ్వరయినా వచ్చి, "అప్పుడు మిమ్ములను దూషించిన మాట నిజమే. ఇప్పుడందుకు పశ్చాత్తాపపడుతున్నాను," అంటే వెంటనే 'పాపం' అనుకుంటా రాయన.

తనతో పనివుండి వచ్చి, ఆ పని చేయించుకోటానికి అలా అంటున్నాడేమో అని ఆయనకు తట్టనే తట్టదు ఆయన శ్రేయస్సు కోరినవారు ఎవ్వరయినా చెప్పినా, "పొరపాటు చేశానని ఏడుస్తూవుంటే ఇంక అంతకంటే వాడిని మాత్రం ఏం చావమంటావు ?" అనేవారు అనడమే కాదు, ఆ 'పశ్చాత్తప్తుని' వెనకవేసుకొని వచ్చి, తనకు నిజం చెప్పిన శ్రేయోభిలాషులతో పోట్లాడేవారు.

గోపాలం గుణం వేరు. అతనికి మనుష్యులను చూచీచూడగానే కొద్దిగానో గొప్పగానో వారి స్వభావం గ్రహించే శక్తి వున్నది.

అందువల్ల కృష్ణస్వామిగారితో మాట్లాడటానికి వచ్చిన ప్రతివారూ తండ్రితో గోపాలం వుండకుండా వుండటాన్నే కోరుకునేవారు. అతను వుండగా మనస్సు విప్పి కృష్ణస్వామిగారితో మాట్లాడటానికి సంకోచించేవారు.

వేంకటరత్నం చౌదరిగారుకూడా గోపాలాన్ని చూడగానే ఇటువంటి కలవరానికే లోన య్యారు కాని తీరా కృష్ణస్వామిగారి ముందుకు వచ్చి కనపడి, ఇంకా ఇప్పుడు చేసేది ఏముంది ?

అంతలో, "రండి, కూర్చోండి," అన్నాడు గోపాలం

కూర్చొని, "ఈ కష్టం మీకు రావలసింది కాదు," అన్నారు వేంకటరత్నం చౌదరిగారు కృష్ణస్వామిగారిని ఉద్దేశించి

కృష్ణస్వామిగారు మాట్లాడలేదు గోపాలానికి ఏమనాలో తోచక మెదలకుండా వూరుకున్నాడు

నిశ్శబ్దం భయంకర రూపం తాల్చ నారంభించింది ఆ నిశ్శబ్దాన్ని వేంకటరత్నం చౌదరిగారు భరించలేకపోయారు

"నేను వారం పదిరోజులనుంచీ ఇంటిదగ్గర లేను ఇవ్వాళే వచ్చాను వచ్చీరాగానే తమరి దర్శనార్థం వద్దా మనుకున్నాను కాని పదిమందిలో వున్నప్పటికన్నా, వొంటరిగా వున్నప్పుడు కలిస్తే మంచిదనే వుద్దేశంతో ఇప్పుడు వచ్చాను"

దీనికికూడా కృష్ణస్వామిగారు మాట్లాడలేదు దీనికికూడా, ఏం చెప్పాలో తెలియక వూరు కున్నాడు గోపాలం కారణాలు ఏవైతేం మొత్తానికి తండ్రీ కొడుకు లిద్దరూ మెదలకుండా కూర్చున్నారు

రెండు కొండల మధ్య ఇరుక్కున్నట్లు అనిపించింది వేంకటరత్నం చౌదరిగారికి ఏదోవొక విధంగా ఆ కొండల మధ్య నుంచి బయట పడాలనే వుద్దేశంతో, "నేను ఇవాళ మీతో వొక ముఖ్యమయిన విషయం చెప్పాలని మనస్సులో దృఢంగా సంకల్పించుకొని వచ్చాను," అన్నారు

అప్పటికీ కృష్ణస్వామిగారు మాట్లాడలేదు కాని మాట్లాడటానికి గోపాలానికి అవకాశం దొరికింది "నేనున్నానని మీకు అభ్యంతరం లేకపోతే, అదేమిటో నాన్నగారికి చెప్పండి,'' అన్నాడు

గోపాలం మాట్లాడటంతో అంతకు ముందుదాకా గాలిలోవున్న బిగువూ, బరువూ, అస్పష్టత వల్ల వచ్చిన భయమూ సడలినై వేంకటరత్నం చౌదరిగారి మనస్సు కొంచెం తేటపడ్డది

"నువ్వు వుంటే ఏం నాయనా ? నువ్వు వినగూడనివి నాయనగారూ నేనూ ఏం మాట్లాడు కుంటాం ? వొకరకంగా నువ్వు వుండటంకూడా మంచిదనే అనుకుంటున్నాను నేను ఎందుకంటే నేను చెప్పదలచింది నువ్వు వినటంవల్ల కూడా కొంత ప్రయోజనం ఉండకపోదు '' అన్నారు

నిజానికి ఆయన ఇక్కడకు రావాలని సంకల్పించుకున్నప్పుడు, కృష్ణస్వామిగారితో ఏమేమి చెప్పాలో, ఎలా చెప్పాలో అన్నీ మనస్సులో నిర్ధారణచేసుకునే వచ్చారు తీరా గోపాలం కూడా వుండటంతో పథకం మారవలసి వచ్చింది దాన్తో మనస్సు తబ్బిబ్బుపడింది

"చాలాకాలంనుంచీ నా మనస్సుని చికాకుపరుస్తున్న ఒక విషయం ఇవాళ మీకు విప్పిచెప్ప దల్చుకున్నాను కృష్ణస్వామిగారూ — నేను ముఖప్రీతి మాటలు చెబుతున్నానని దయచేసి మీ



ఒనుకోవద్దు  కడుపులో ఉన్నదే చెబుతున్నాను" అని ప్రారంభించారు వేంకటరత్నం చౌదరిగారు

ఈ మాటలకు కృష్ణస్వామిగారు కొంచెం చలించారు  గోపాలం శ్రద్ధగా వింటూ కూర్చున్నాడు

"మాబోటివారికోసం మీరు చేసిన త్యాగం నేను అర్థం చేసుకోలేదని మీ రనుకోవద్దు. మీబోటివారు ఒకరు మాహాపర్వతశ్రేణీలాగా మాకు అండగా నిలబడి ఉండబట్టే బ్రాహ్మణ కవులు మమ్మల్ని గురించి కొద్దో–గొప్పో మంచిగా చెబుతున్నారు మీరే లేకపోతే మమ్మల్ని క్షుద్ర కీటకాలుగా పరిగణించి దులిపివేసేవారని నాకు తెలుసు అంతేగాదు, ఒకవిధంగా మీమీద పగ తీర్చుకోటానికి మా కవిత్వాలను బాగిడి మమ్మల్ని అభినందిస్తున్నారనే సంగతి కూడా నాకు తెలుసు మీ కవిత్వాన్ని తెగడి, మా కవిత్వాన్ని పొగడుతున్నప్పుడల్లా ఈ విషయం మాబోటివాళ్ళకు జ్ఞాపకం వస్తూనే వుంటుంది  మీరు అనేక బాధలకు లోనై మాలాంటివాళ్ళకు సంఘంలో కాస్త గౌరవ ప్రతిపత్తి కలిగే అవకాశం చేకూర్చిపెడుతున్నారనే సంగతి తిరుగు లేని సత్యం "

ఈ మాటలకు కృష్ణస్వామిగారి మనస్సు కొంత మెత్తబడటం, గోపాలం మనస్సు మరీ గట్టిపడటం జరిగింది అయినప్పటికీ తన తండ్రి ఆయన మాటలు నమ్ముతున్నాడనే భయం కలగకపోతే గోపాలం మెదలకుండా ఊరుకునేవాడే ఇప్పుడు మాత్రం ఊరుకోబుద్ధికాలేదు

"ఇటువంటి అభిప్రాయాలు మీ కున్నప్పుడు ఈ విషయాలు పదిమందికీ ఎందుకు వెల్లడి చేయరు ? దానివల్ల ప్రజాసామాన్యానికి ఈ సత్యం తెలుస్తుంది కదా, సత్యం తెలియటం దోషం కాదుగదా ?'' అనడిగాడు వేంకటరత్నం చౌదరిగారిని

వేంకటరత్నం చౌదరిగారు ఈ ప్రశ్నలవల్ల కలిగిన కలవరాన్ని దిగమింగి యిలా అన్నారు.

"అబ్బాయీ, నువ్వు అడగవలసిన ప్రశ్నే అడిగావు  కాని ఒకవిషయం మాత్రం మర్చిపోయావు అందరూ మీ నాయనగారిలాంటి ధైర్యసాహసాలు కలిగినవారు కారు. ఒక ఆదర్శం కోసం తన సర్వస్వాన్నీ త్యజించగలిగిన ఆవేశం, నిస్వార్థబుద్ధి ఏ కొద్దిమందికి మాత్రమే

వుంటుంది. అటువంటివారిలో మీ నాయనగారు ముఖ్యులు. వారు కారణజన్ములు. ఇక మేమంటామా – ఏదో. ప్రాపంచక సుఖాలకోసం ప్రాకులాడేవాళ్ళం. బ్రతికినన్నాళ్లూ సుఖంగా బ్రతికి దాటిపోవాలనే సంకల్పం గలిగినవాళ్ళం. మీ నాయనగారికీ – మాకూ పోలి కెక్కడ ? అతి బలహీనమైన మమ్మల్ని ఆదర్శశిఖరాలమీదకు నడిచి కూర్చోమంటే మావల్ల అయేపనా ? అందుకు పూనుకున్నా నడుములు విరగటంకన్నా జరిగేదేమీ వుండదు. అంతమాత్రాన ఆదర్శ పురుషుల ఔన్నత్యం, మిరిమిట్లుగొలిపే వారి ప్రతిభా సుఖప్రదంగా బ్రతకటానికి వారివల్ల మేము పొందుతున్న సహాయమూ గ్రహించటం లేదని మాత్రం నువ్వనుకోవద్దు. మాకన్నీ తెలుసు. తెలిసీ వ్యవహారిక ప్రపంచాన్ని అధిగమించలేక, తుచ్ఛ సుఖాలను ఒదులుకోలేక ఈవిధంగా బ్రతుకుతున్నాం,'' అన్నారు.

ఈ వాదం గోపాలానికి నచ్చలేదు – "అయితే మీకోసం కష్టపడేవారిని ఆదుకోవలసిన బాధ్యత మీమీద లేదా ? కష్టాల నన్నిటినీ వారికే వదలి – పైగా శత్రుకోటిలో చేరి వారి దారిలో పల్లేరుకాయలు జల్లడం భావ్యమేనా ? దానివల్ల వారు తలపెట్టిన ఉద్యమానికి ద్రోహం చేయటం కాదా ?'' అనడిగాడు.

ఈ ప్రశ్నకు తలవాల్చి, "ఇంతటి మహానుభావులకు సహాయంచేయటానికి మేమెంతటి వారం ? మేము వారికి చేయగలిగిన సహాయం ఏముంది ? అభివృద్ధి నిరోధకులతో వారు ఒక్కరే పోరాడగల శక్తిమంతులు. మేము వారి నీడన కాలం వెళ్ళబుచ్చేవాళ్ళం. ఈ సంగతి మా అవస్త – చిన్నవాడవు నీకు తెలియకపోయినా మానవుల బలహీనతలపట్ల ఎంతో సాను భూతి కలిగిన మీ నాన్నగారు గ్రహించగలరు'' అన్నారు వేంకటరత్నం చౌదరిగారు

కవికులాలంకారుల ఉద్దేశం వారు మాట్లాడటం మొదలుపెట్టినప్పుడే అర్థమైంది గోపాలానికి. వారి మనస్సు కృష్ణస్వామిగారికి వ్యతిరేకభావంతోటే నిండివుంది. అందులో సందేహంలేదు. కాని కృష్ణస్వామిగారికి కోపం తెప్పించాలనే అభిప్రాయం ఆయనకు లేదు. కృష్ణస్వామిగారికి కోపం వస్తే తనకీనాటికీ అపకారం చేయగలరని ఆయనకు తెలుసు అందుకని ఆయన మనస్సుని మెత్తపరచటమే ఆయన ఆకాంక్ష.

ఇవన్నీ జ్ఞాపకంవచ్చి ఆయనకు గట్టిగా సమాధానం చెప్పాలని సంకల్పించాడు గోపాలం. రెండావుల దూడగా ఉండటంవల్ల ఎవరూ ఉద్ధరింపబడరు అని చెపుదామనుకున్నాడు – స్వార్థ బుద్ధితో కాక ఎవరి నమ్మకాలనుబట్టి వారు జీవితాలను నడుపుకోవటం మంచిదని సలహా యిద్దామనుకున్నాడు.

గోపాలం మనస్సులో చెలరేగుతున్న కలవరం కృష్ణస్వామిగారు కనిపెట్టారు. కనిపెట్టి "ఆయన చెప్పిందాంట్లోకూడా కొంత సత్యం లేకపోలేదు గోపీ నేనీ ఉద్యమం ప్రారంభిం చింది నాకోసం కాదు కదా ? ఇతరులకు సుఖం కలగాలనే కదా ? నేను యిబ్బంది పడటంవల్ల వారు సుఖపడితే అందుకు నేను సంతోషించవలసిందే. నాకు వ్యతిరేక భావాన్ని ప్రదర్శించడం వల్లా, నన్ను విమర్శించటం వల్లా వేంకటరత్నం చౌదరిగారికి సంఘంలో గౌరవం, ఉత్తమ కవి



"ఏం బాబూ ! నీవేనా మిస్ రావును పెళ్ళిచేసుకుంది ?"

"లేదండీ ! నేను సెమీ ఫైనల్లో ఓడిపోయాను."

అనే కీర్తి లభిస్తే ఆమేరకు నేను ఆనందించవలసిందే. సంఘంలో మానసికంగా పీడింపబడు తున్న ఒక వ్యక్తి పదిమంది పొగడ్తలను అందుకుంటున్నాడంటే అది ముదావహమైన విషయమే. నాతోపాటు ఇతర్లుకూడా కష్టాలకు గురికావాలని కోరే హక్కు నా కెక్కడ వుంది?'' అన్నారు.

గోపాలం మాటలాడలేదు. తండ్రీ, వేంకటరత్నం చౌదరిగారూ మాట్లాడుకుంటుంటే వింటూ కూర్చున్నాడు. ఒక్క క్షణంలో కృష్ణస్వామిగారు వేంకటరత్నం చౌదరిగారు చేసిన తప్పుల నన్నిటినీ మర్చిపోయి — ప్రాణస్నేహితునివలె మాట్లాడ నారంభించారు. తన కష్టసుఖాల నన్నిటినీ ఆయనకు చెప్పారు. తన విరోధులను నిర్మొగమాటంగా ఆయనముందు విమర్శించారు. తాను ఇకముందు వ్రాయదలచుకున్న గ్రంథాలను ఆయనకు విడమర్చి చెప్పారు. వేంకటరత్నం చౌదరిగారు కృష్ణస్వామిగారు ప్రచురించిన గ్రంధాలలోని, పద్యాలను చదివి విని పించి, వాటిల్లోని చమత్కృతులను పొగుడుతూ కూర్చున్నారు. అంతేగాక కృష్ణస్వామిగారింకా ఏ ఏ గ్రంథాలను వ్రాస్తే బాగుంటుందోకూడా చెప్పీచెప్పనట్లు చెప్పారు. అవన్నీ హృదయ పూర్వకంగా నమ్మి వేంకటరత్నం చౌదరిగారిని పరమ మిత్రులుగా భావిస్తూ వింటూ కూర్చు న్నారు కృష్ణస్వామిగారు.

వేంకటరత్నం చౌదరిగారు మరికొంచెంసేపు కూర్చుని, కృష్ణస్వామిగారివద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళగానే, "పాపం. మనిషి మంచివాడే" అన్నారు కృష్ణస్వామిగారు.

ఇక గోపాలం ఏం చెప్పగలడు? ఏమి చెప్పి మాత్రం ఏమి ప్రయోజనం? వేంకటరత్నం చౌదరిగారు దిగ్విజయం చేసిన వారికి మల్లె ఉండిఉంటారని అతనికి తెలుసు. బైటకువెళ్ళి, తన తండ్రిమీద వినరాని నిందలు మోపుతారనికూడా అతనికి తెలుసు. అయినప్పటికీ వాటిని చెప్పటంవల్ల తండ్రి మనస్సుని కష్టపెట్టటం మాత్రమే అవుతుందని భావించి, మెదలకుండా ఊరుకున్నాడు

కృష్ణస్వామిగారు తన ఆలోచనలో తామున్నారు. కుమారుని మానసిక ఆందోళన పసికట్టే స్థితిలో వారు లేరు. "ఈ ప్రపంచం ఎంత విచిత్రమైంది! ఈ విచిత్రానికి అంతున్నట్లు లేదు. నేను బ్రాహ్మణేతరులకు సహాయం చేయటానికిగాను నా జీవితాన్ని అంకితం చేశాను అటువంటి నన్ను ద్వేషించినట్లు నటించటంవల్ల మాత్రమే ఆ సంఘానికి ఉపకారం జరుగుతూంది. నావల్ల బ్రాహ్మణేతర సంఘం ఏమాత్రమైనా నోరు విప్పగలిగితే, మాట్లాడటం నేర్చుకుని ఉంటే ఆ మాటలు ప్రప్రథమంగా నన్ను విమర్శించటానికీ, నామీద వ్యతిరేకతను ప్రకటించటానికీ వినియోగపడుతున్నవి ఈ పరిస్థితి చాలా విచిత్రంగాలేదా గోపీ?" అని కుమారుడిని అడిగారు.

"అందులో సందేహంలేదు," అన్నాడు గోపాలం ఆమాట అతని మనసులోవున్న ఏ భావాలకు చిహ్నంగా బైటపడిందో ఆలోచించే ధోరణిలో లేరు కృష్ణస్వామిగారు. వారు దీర్ఘాలోచనా తత్పరులై అలముకుంటున్న చీకటిలోకి తమ దృష్టిని నిగిడిస్తూ కూర్చున్నారు.

* * * *

మరునాడు గోపాలాన్ని పరామర్శించటానికి అతని హాస్టల్ స్నేహితుడు శివకుమార్ వచ్చాడు. శివకుమార్ కాలేజీ మానివేసి, పార్టీపనిలో నిమగ్నుడైన తరువాత, ఇదే మొదటిసారిగా గోపాలానికి కనబడటం.

అతను చాలా మారిపోయాడు, శారీరకంగా చాలా చిక్కిపోయాడు. చూసీ-చూడగానే అతను శరీరపోషణ విషయంలో ఏ కాస్త శ్రద్ధా తీసుకోవటం లేదని ఇట్టే ద్యోతక మవుతుంది. అతని బుగ్గలు పీక్కుపోయి వున్నవి. నుదురుమీద చర్మం ముడుతలుపడ నారంభించింది. జుట్టు సంస్కారం లేక చిందరవందరగా రేగివుంది. కండ్లు గుంటలుపడివున్నై. కాని మాటలలోనూ, చూపుల్లోనూ పట్టుదలా, దానితోపాటు ఇదివరకు అతనిలోఉండే క్రౌర్యం కొట్టవచ్చేట్టు కనిపిస్తూ వున్నై మనిషి మానసికంగా కూడా చాలా మారిపోయాడని అతన్ని చూడగానే నిర్ధారణ చేసుకున్నాడు గోపాలం

అతను వచ్చీ రావటమే విసురుగా ఉప్పెనలాగా వచ్చాడు ఏదోపనిమీదవున్న గోపాలం అతన్ని వెంటనే గుర్తుపట్టలేకపోయాడు.

"నేనోయ్! శివకుమార్ని." అని చెప్పి, మిగిలిన కుశలప్రశ్నలకు తావివ్వకుండా గోపాలాని కెదురుగా కూర్చొని, "ఈ ప్రపంచం లోప భూయిష్టమైందిగనుక ఇటువంటి కష్టాలు తరుచు వస్తూనే వుంటై. వాటిని మనం లెక్క చేయకూడదు. లొంగిపోకూడదు. కష్టాలు వొస్తూన్నకొద్దీ మనం విజృంభించి ఇటువంటి కష్టాలులేని సమాజంకోసం ద్విగుణీకృతోత్సాహంతోపాటు పడాలి,'' అన్నాడు.

కాసేపు స్నేహితులిద్దరూ మాట్లాడకుండా ఒకరినొకరు చూసుకుంటూ కూర్చున్నారు. అప్పుడు శివకుమార్ ఏమాలోచిస్తున్నదీ చెప్పడం కష్టం. గోపాలం మనస్సుమాత్రం దర్పణం లాగా వుంది. తనస్నేహితుని చూపుల్లో కనబడే క్రౌర్యం, మాటల్లో వినబడే మొరటుతనం ఎటువంటి భయంకర కష్టాలకు లోనైతే వొచ్చాయో—అని ఆలోచిస్తున్నాడు. పూర్వం అతని మనస్సులో ఉన్న మార్దవం ఇప్పుడులేదు. మానవ సంబంధాలకోసం ఆరాట పడి అశ్రులు చాచే కోమలత్వం ఇప్పు డతనిలో లేదు అతనిలోఉన్నశక్తులన్నీ ఇప్పుడు ఒకే ఒక పరుష భావంగా రూపొందాయి.

"నువ్వు వొచ్చినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను శివకుమార్" అన్నాడు గోపాలం.

"తీరికలేని పనుల్లో చిక్కుకుని ఉన్నాను. అయినా నిన్ను పలకరించి పోదామని వచ్చాను."

"ఇప్పుడేం జేస్తున్నావ్?" అనడిగాడు గోపాలం.

"గనుల కార్మికులతో పనిచేస్తున్నాను." వాళ్ళ జీవితాలను చూస్తూంటే, 'మనం పడేకష్టాలూ ఒక కష్టాలేనా' అని అనిపిస్తూంటుంది గోపాలం. తిండికి ఉండి ఒచ్చేకష్టాలు వేరూ, తిండికి లేకపోవడంలో వచ్చే కష్టాలు వేరూ. తిండికి లేకపోవటంవల్ల మానవ పరిణామమే ఆగిపో తుంది ఆగిపోవటమేకాదు—వెనక్కి దేకుతుంది కూడానూ తిండికిలేని ఈ కార్మిక జనాన్ని చూస్తూంటే వారిలో మానవులకు సహజంగా ఉండే లక్షణాలే నశించినై అనిపిస్తుంది. రాయి నుంచి దేవతలుగా పరిణామం చెందేవారు కొందరుంటే, దేవతలనుంచి రాళ్ళుగా దిగజారిపోయే వారు కొందరుంటారని అనిపిస్తూవుంది ప్రజల్లో ఎక్కువమందిని ఈ వికృత పరిణామానికి గురిచేసింది ఎవరు? పుటకలో కొన్ని హక్కులను పొందిన మనలాంటివాళ్ళే. ఈ నిర్ధారణకు వచ్చినప్పుడు ప్రత్యేకహక్కు లనుభవించే ప్రతివ్యక్తిమీదా ఎంతద్వేషం, కసి ప్రబలుతుందో ఎప్పుడైనా ఆలోచించావా? అందులో అటువంటి వ్యక్తులు తమ దౌష్ట్యాలవల్ల పశుప్రాయులుగా తయారవుతున్న మానవకోటిపట్ల ఒక్క కన్నీటిబొట్టయినా రాల్చనప్పుడు హృదయం భగ్గు భగ్గున మండుతుంది. మొత్తం ఈ ప్రపంచాన్నే దగ్ధపటలంచేసి, ఆ బూడిదలోనుంచి దోపిడీ విధానానికీ, హెచ్చుతగ్గులకూ ఆస్కారంలేని ఒక నూతన జీవితాన్ని నిర్మించబుద్ధవుతుంది. అలా నిర్మించలేకపోతే, సామాన్య ప్రజలతోపాటు ప్రత్యేక హక్కులను. అనుభవించే వారుకూడా నాశనమైపోనీ అని అనుకోబుద్ధవుతుంది. నేనిప్పుడా స్థితిలో ఉన్నాను గోపాలం. ప్రపంచం బాగుపడటమో, దగ్ధ పటలమవటమో తక్షణం ఏదోఒకటి జరగాలని కోరుకుంటు న్నాను" అన్నాడు శివకుమార్.

తన స్నేహితుడిని చూస్తూంటే గోపాలానికి విచారమే కలిగింది. ఈ సంఘంలో ప్రత్యేక హక్కులను అనుభవిస్తున్న అదృష్టవంతుల మూర్ఖత్వంవల్ల ఎన్ని సుకుమార హృదయాలు ఈ విధంగా మారి అగ్ని జ్వాలలను విరజిమ్ముతున్నాయో అతను ఊహించుకోలేక పోయాడు.

ప్రత్యేకహక్కులు అనుభవించేవాళ్లు సున్నితమైన మాటలు మాట్లాడుతారుగాని, సన్నాయి నొక్కుల నొక్కుతారుగాని ఈ జీవితంలో క్రౌర్యానికి కూడా చోటులేక పోలేదు. అని అంగీక రించరు. అలా చోటులేకపోతే అది పుట్టేవుండేది కాదు. మానవ హృదయాలలో దానికి

స్తలం ఉండేదేకాదు. మూర్ఖత్వం బలిసినప్పుడు, హృదయాలు పిడచకట్టినప్పుడు విశాలదృ కొరవడినప్పుడు, కరుణ నశించినప్పుడు వాటి నెదుర్కోటానికి క్రౌర్యం జనిస్తుంది; విజృం భిస్తుంది; దహిస్తుంది. ఈ పరిస్థితి పరమ వేదాంతులు సైతం అంగీకరించిందే. వేదాంతులే కాదు—భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పినదికూడా యిదే. దుష్ట శిక్షణ తప్పనిసరి అయిన పరిస్థితి అది.

అయితే మానవసంఘంలో ప్రత్యేక హక్కులను అనుభవించినవారు, తమ కిరాతక చర్యల వల్ల అనివార్యమవుతున్న ఈ దృష్టిని అంగీకరించరు. క్రౌర్యాన్ని వారు నిరసిస్తారు. తమ ప్రత్యేక హక్కులను నిలబెట్టుకోటానికి వారీ పనిచేయటం సహజమే. కాని వారే సంఘంలో పెత్తం దార్లుగా ఉండటంవల్ల వారు ప్రచారం చేసిన సంస్కారాన్ని అనుసరించటానికి అమాయక ప్రజలు ప్రయత్నించటంతో సంఘ సంస్కారులకూ, విప్లవకారులకూ ఒకపెద్ద చిక్కు వచ్చి పడుతుంది. ఏ సంస్కారంవల్ల ప్రజలు హీనస్థితిలో మ్రగ్గుతున్నారో, ఆ సంస్కారాన్ని ఎదు ర్కోటానికి ప్రజలను సంఘటిత పర్చడం వారికి కష్టం అవుతుంది. గోటితో తీరేపని గొడ్డలితో తీర్చవలసివస్తుంది. ఏ కారణంవల్ల సంఘ సంస్కారులూ, విప్లవకారులూ ఇటువంటి పనికి పూనుకోవలసి వచ్చిందో ప్రపంచం మర్చిపోయి వారిని నిందిస్తూ ఆహాకారాలను రేపుతుంది. ఏదో ఘోరాన్యాయం జరుగుతున్నట్టు పలవిస్తుంది. ప్రచారక సాధనాలన్నీ ఈ ప్రత్యేక హక్కు లనుభవించేవారి చేతుల్లో ఉండటంవల్ల సత్యం మరుగున పడుతుంది. ఆ సత్యం అందంగా అలంకరించుకుని తన విన్యాస వీచికలతో ప్రజల మనస్సులను ఆకర్షించి, మోసగించి, వారి పతనానికి పరాకాష్టను రూపొందిస్తుంది. అన్ని, యుగాలలోనూ, అన్ని పరిస్థితుల్లోనూ నడుస్తున్న జగన్నాటకమే యిది.

ఈ విషయాలన్నీ శివకుమార్ మాటలను వింటూ కూర్చున్న గోపాలం హృదయంలో మూకమ్మడిగా చెలరేగినై. శివకుమార్ ప్రసరిస్తున్న అగ్నిజ్వాలల వేడికి అతను కుతకుత ఉడికిపోయాడు.

"ఇప్పుడు నువ్వుచేస్తున్నపని నీ తల్లిదండ్రులు అంగీకరించారా శివరామకుమార్?" అనడి గాడు. అడగడమైతే అడిగాడుగాని, అడిగీ అడగ్గానే తనప్రశ్న చాలా పేలవమైనదిగానూ, అనుచితమైందిగానూ అతని మనస్సుకే తట్టింది. తన ప్రశ్నను ఉపసంహరించుకునే అవకాశం వుంటే అతను చాలా సంతోషించి వుండేవాడు కాని ఆ అవకాశం లేదు. అతనిప్రశ్న అప్పటికే శివకుమార్ హృదయాన్ని తాకి, కలవరపెట్టింది. జలదరిస్తున్న పెదిమలతో శివకుమార్ చెప్పుకు పోయాడు:

"అది చాలా స్వల్పవిషయం గోపాలం," చెడుపనులు చేయటానికైతే ఇతరుల అంగీకారం ఆశీర్వాదం కావలసి రావచ్చు మంచిపని చేయటానికి ఎవరి ప్రోద్బలం అవసరంలేదు. తల్లీ— దండ్రీ నన్ను పోషించి పెద్దవాణ్ణి చేశారు. ఇక నా జీవితం నాదే. అంతేకాదు. హెచ్చుతగ్గులను శాశ్వతం చేయదల్చిన, ప్రస్తుతం ఆచరణలోవున్న, ఈ యినుప చట్రంలో పడి ఎంతమంది తలిదండ్రులు—ఎంతమంది బిడ్డలు ముక్కలు ముక్కలు అవుతున్నారో మనం చెప్పగలమా? .




"చూశావా, వీడు మనల్ని గుర్తే పట్టటంలేదు. ఎలక్షన్‌లో గెలిచినట్లుంది."

మరి వారి మాటేమిటి ? తల్లిదండ్రులకూ—బిడ్డలకూ ఉండే సంబంధం అందరిపట్ల ఒకటిగానే వుండాలి ఆ సంబంధం వర్ధిల్లటం మంచిదైతే అందరిలోనూ వర్ధిల్లే అవకాశం వుండాలి అలా లేనప్పుడు ఈ సంబంధాలకు అర్ధంలేదు. ఇతర తలిదండ్రులకూ, బిడ్డలకూ ఉంటున్న సంబంధాన్ని నిర్దాక్షిణ్యంగా తృంచివేసి నాకు వర్తించే మానవ సంబంధాలను నిలబెట్టుకోటానికి నేను ప్రయత్నించను. అది ఘోరపాపం, ఈ సంబంధాలకు నిలయమైన ప్రజల కుటుంబాలను నిలబెట్టడానికి నేను నా తలిదండ్రులను వదులుకోవటం అనుచిత మనుకోవటం లేదు. నేను చేస్తున్న పనికి నా తలిదండ్రులు అంగీకరించలేదు గోపాలం! అందుకని నేను వారిని వదులుకున్నాను," అన్నాడు శివకుమార్. అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు

శివకుమార్ వాదనలో ఉన్న తర్కానికీ, బీదల అభివృద్ధికోసం అతను చూపుతున్న ఆవేశానికీ, నిస్వార్ధ బుద్ధికీ వివశుడై కూర్చున్నాడు గోపాలం. మనిషిని అంతగా ఊపివేయగలిగిన ఆ ఆవేశానికి ముగ్ధుడయ్యాడు. ఒకమనిషి, ఒక ఆవేశానికి ఆత్మార్పణ చేసుకోటానికి సిద్ధపడ్డాడంటే అందులో సత్యం ఉండి వుండాలి. ఆ ఆవేశంలో సత్యస్వరూప దర్శనం కలగబట్టే ఆ మనిషి దానికి దాసుడై వుంటాడు. లేకపోతే అందరిలాగా సుఖాలను అనుభవించకుండా కష్టాలను ఆశ్రయించి ప్రాణత్యాగానికి పూనుకునేఅంత వెర్రివాడు కాడు మానవుడు. అతని అనుభవంలోనికి వచ్చిన సత్యం సంపూర్ణ సత్యంయొక్క శకలమే అవుగాక—అంతకంటే విశాలమైన సత్యం మరిఒకటి ఉండుగాక—అయినప్పటికీ మానవుడు తనకు అందిన సత్యం ద్వారానే సంపూర్ణ సత్యాన్ని సాధించగలుగుతాడు,—ముక్తిని పొందగలుగుతాడు, భగవంతుని చేరగలుగుతాడు. అలాగాక ఇది అర్ధసత్యమని ఎప్పటికప్పుడు దాని జోలికి వెళ్ళటానికి

నిరాకరించిన మానవుడు పతనమవుతాడు, పాపపంకిలంలో చిక్కుకుంటాడు, రాక్షసరూపం ధరిస్తాడు ఆ మానవునికి అందిన సత్యం చురకత్తి వంటిది కావచ్చు, అగ్నిజ్వాలవంటిది కావచ్చు. దానివల్ల కొందరికి అపాయం కలగొచ్చు కాని ఆ మానవుని పురోగమనానికి అతి ఉత్తమమైన సాధనమే అందువల్లే అతనిమాటలకు బలం వుంటుంది, తేజస్సుంటుంది, అతను ఇతరులను ప్రబలంగా ఆకర్షించగలుగుతాడు .

అవి గాంధీగారు స్వాతంత్ర్య స్థాపనకోసం మరొక ఉద్యమాన్ని నడపాలని సంకల్పించు కున్నరోజులు, అందుకుగాను ఆయన సర్వప్రయత్నాలూ చేస్తున్న రోజులు, ఆయన పిలుపు కోసం ప్రజలు అర్రులెత్తి ఎదురుచూస్తున్నరోజులు ప్రతి గ్రామంలోనూ సంఘాలను స్థాపించి, ప్రజలు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడానికి ఆయత్తమవుతున్న రోజులు

శివకుమార్ కమ్యూనిస్టు కార్మిక కర్షకుల్లో అతను చేస్తున్న కృషిఅంతా ఆ పార్టీ తరఫునే చేస్తున్నాడు కమ్యూనిస్టు పార్టీకి గాంధీ సిద్ధాంతాలమీద నమ్మకంగానీ, చివరకు సానుభూతి గానీ లేదని గోపాలానికి తెలుసు అప్పుడు జరగబోయే ఉద్యమంలో వ్యాకె పాత్ర ధరించ బోతున్నదీ శివకుమార్ ద్వారా తెలుసుకోదలచుకున్నాడు గోపాలం

''ఇప్పుడు జరగబోయే స్వాతంత్ర్యోద్యమంలో నీవుకూడా పాల్గొంటావనుకుంటాను''

"లేదు'' అన్నాడు శివకుమార్

''ఎందుకని ?"

"గాంధీ ఉద్యమం ఫలించదు అసహాయ నిరాకరణానికి జడిసి, మనకు స్వాతంత్ర్యాన్నిచ్చి వెళ్ళిపోయేంత భీరువులుకాదు ఇంగ్లీషువారు ఒకవేళ వెళ్ళిపోయినా మన దేశంలో అధికారం లోకి వచ్చేదెవరు ? ధనవంతులు మనకు కావలసింది దోపిడీవిధానం నిర్మూలమై సర్వమాన వులకూ సమానత్వం కలగటమేగాని—పరదేశస్తులు పోయి స్వదేశస్తులు అధికారంలోకి రావడం కాదు ఆమాటకొస్తే పరదేశస్తులకంటే స్వదేశస్తులే సామాన్య ప్రజలకు పరమ శత్రువు లవుతారు. మన దేశంలోని ధనవంతులకు ఇంగ్లీషు వారికంటే సంఘంలో ఎక్కువ మద్దతు కనిపిస్తుంది ఇంగ్లీషువారి కిక్కడ ఎవరున్నారు ? నా అనేవారెవరూ లేరు వారికి స్వార్థపరులు ఏ కొద్దిమందో తప్ప మిగిలిన వారందరూ శత్రువులే ఈ దేశములోని ధనవంతులు కూడా వారికి శత్రువులే ఎందుకంటే ఇంగ్లీషువారున్నంతకాలం తమ వ్యాపారానికి అడ్డుగనుక. తాము విజృంభించి, బీదలను దోచుకుని, లాభాలు సంపాదించే అవకాశం తక్కువగనుక ఈ కారణంవల్ల యింగ్లీషువారిని తరిమి ఈ దేశంలోని ధనవంతులకు అధికారాన్ని అప్పగించ డానికి మేము అంగీకరించం ''

"మరేం జరగాలంటావు ?''

''ఇంగ్లీషువారు వెళ్ళవలసిందే. వారు వెళ్ళటంతో అధికారం కార్మిక కర్షకుల కైవసం కావాలి అటు ఆంగ్లేయులూ, ఇటు మనదేశంలోని ధనవంతులూ యిద్దరూ మన శత్రువులే ఇద్దరినీ అధికారంలోకి రాకుండా చూడాల్సిన బాధ్యత మామీద వుంది "

అందుకేం చేయ దలిచారు ?" అని అడిగాడు గోపాలం.

'ఇంగ్లీషువాళ్ళమీద ఈ ధనికవర్గం నడిపే ఉద్యమంలో మేము పాల్గొనం. ఈ అవకాశం ని దేశంలోఉన్న కార్మిక కర్షకులను సంఘటితపర్చి ఈ ఉద్యమంవల్ల కలిగిన గంద్ర గోనో, ఈ ఉద్యమం అపజయం పొందటంవల్ల కలిగిన నిస్పృహలోనో అధికారాన్ని తం చేసుకుంటాం ఈ ఉద్యమంయొక్క నిష్ప్రయోజనకత్వం అప్పటికి ఋజువై ంది కనుక ప్రజలు మా మాట వింటారు మా నాయకత్వంకింద నడవటానికి ఉత్స ు. ఇది చరిత్రచెప్పిన సత్యం ఇప్పటినుంచీ ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకో కగాను మేము జాగరూకులమై ఉన్నాం" అన్నాడు శివకుమార్.

శివకుమార్ ఆవేశానికి చలించాడు గోపాలం. అతని భావాలు సడలిన గోపాలం మనస్సు లోకి చొచ్చుకు పోయినై స్నేహితులిద్దరూ కాసేపు మౌనంగా కూర్చున్నారు భావాల బరువును మోయలేక ఇద్దరూ కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

"ఇకనేను వెళ్ళి వస్తాను నాకు తొందరపను లనేకం ఉన్నాయ్ " అన్నాడు శివకుమార్.

గోపాలానికి శివకుమార్‌ని అప్పుడే విడిచిపెట్ట బుద్ధికాలేదు. ఎన్నేళ్ళక్రిందటో చూసిన చూడటం. "నువెళ్ళటానికి వీల్లేదు శివకుమార్" అన్నాడు.

"వెళ్ళక తప్పదు గోపాలం"

వీల్లేదు. నిన్ను తనివితీరా చూసినట్లేలేదు, నీతో తనివితీరా మాట్లాడినట్టేలేదు మళ్ళీ ఎప్పుడు కలుస్తామో అసలు కలుస్తామో–లేదో " అని బలవంతంగా ఆపూట కాపాడు గోపాలం.

ఆరాత్రి భోజనాలు చేసి, మిత్రులిద్దరూ తెల్లవారు మూడు గంటలవరకూ మాట్లాడుకుంటూ పడుకున్నారు ఏమేమి మాట్లాడుకున్నారో చెప్పడంకంటె—అన్ని విషయాలూ మాట్లాడు కున్నారంటే సరిపోతుంది వారు ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారన్న దానికంటే—ఒకరి మనస్సుని ఒకరు చదువుకున్నారంటే సరిపోతుంది. వారి చిన్ననాటి సాంగత్యం మళ్ళీ చిగిర్చింది మొగ్గలు తొడిగింది— ఎవరి మనస్సులు వారివే అయినా, ఏకమైనవి

మరునాడు ఉదయం మిత్రుడిదగ్గిర శలవుతీసుకుని వెళ్ళిపోయాడు శివకుమార్. 'ఇతన్ని మళ్ళీ చూస్తానా ?' అని అనుకున్నాడు గోపాలం అలా అనుకోవడంతో అతని కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగినవి. 'పాత్రలు వస్తున్నవి – పోతున్నవి ఇందులో ఏ పాత్ర నిత్యం, ఏ సంబంధం సత్యం' అని ప్రశ్నించుకున్నాడు గోపాలం. వెంటనే తన తండ్రివేసిన ప్రశ్న అతని కండ్ల ముందు తాండవించింది "ఈ ప్రపంచానికి ఏమైనా అర్థముందా ?"

(సశేషం)

Printed and Published by A Sudhakar Rao from Yuva Press 5-9-88, Public Garden Road, Hyderabad-1 Controlling Editor , Sri "CHAKRAPANI

# గతమాసం చిత్ర పరిచయ పోటీ



**బహుమతి పొందిన వ్యాఖ్య:**

"ధాత్రి మించెను నోర్పులో దార అపుడు
మంది మించెను తులను, ఆ మగువ యిపుడు."

పంపినవారు : R. R. కృష్ణ, బాపట్ల.

---

చిత్ర పరిచయ పోటీకిగాను వేయబడిన బొమ్మకు సరియైన వ్యాఖ్య వ్రాసినవారికి పదిరూపాయల విలువగల పుస్తకములను బహుమతిగా పంపుతాము. ఇంగ్లీషు కాప్షన్ పనికి రాదు. వ్యాఖ్య ఈ నెల 15 వ తేదీలోగా యువ సంపాదకునికి చేరాలి.

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

101, పుష్పకుంజ్ ఎ, రోడ్, చర్చిగేట్, బొంబాయి-1.

## ఆరవ సంవత్సరం...

ఆంధ్రప్రదేశ్ తొలి అయిదు సంవత్సరాలూ, రెండవ ప్రణాళికా ఏక కాలంలో గడిచాయి. మన రాష్ట్రంలో రెండవ ప్రణాళిక కేటాయింపును మించి రూ. 14 కోట్లు అధికంగా ఖర్చుపెట్ట గలిగాము. రాష్ట్రపు ఆరవ సంవత్సరంకూడా, రూ. 305 కోట్ల మూడవ ప్రణాళికా లక్ష్యాలను సాధించడానికై అదే అభివృద్ధి క్రమంలో పురోగమించింది.



అమెరికా రాయబారి ప్రొఫెసర్ జె. కె. గాల్‌బ్రెత్ నర్సాపూర్‌లో బడిపిల్లల మధ్యాహ్న భోజన పథకానికి ప్రారంభోత్సవం చేశారు.

* భారీ ప్రాజెక్టు అయిన నాగార్జునసాగర్‌కు క్రిందటి సంవత్సరం రూ. 19 కోట్లు ఖర్చు చెయ్యడం జరిగింది.

* రాష్ట్రంలో సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించడానికై రూ. 3 కోట్ల పెట్టుబడి ధనంతో నెలకొల్పబడిన పారిశ్రామి కాభివృద్ధి సంస్థ, పది ప్రాజెక్టుల పరిశీలనను చేపట్టింది. వీటికి సుమారు రూ. 19.65 కోట్లు ఖర్చు అవుద్దని అంచనా,

* లఘు పరిశ్రమల అభివృద్ధికై ప్రత్యేకంగా ఒక సంస్థను స్థాపించడం జరిగింది. దీనికి ప్రభుత్వం, వాటా ధనంగా రూ. 20 లక్షలు, ఋణంగా రూ. 35 లక్షలు ఇచ్చింది.

* రాష్ట్ర గనుల అభివృద్ధి సంస్థ క్రిందటేడు పని ప్రారంభించింది. కృష్ణా జిల్లాలో ముడి ఇనుము నిలువలను వెలికితీసే కార్యక్రమంలో ఇది నిమగ్నమై ఉంది. ఈ ప్రాంతంలో 1961 డిసెంబరులో గనులు త్రవ్వకం ప్రారంభించి, లక్ష టన్నులకు పైగా ముడి ఇనుమును త్రవ్వి తీయడం జరిగింది. ఇంకా అనేక ఖనిజాలను వెలికి తియ్యడానికి, ఆస్బస్టాస్, రాగి, గ్రాఫైట్ మొదలైనవాటి విషయంలో విస్తారంగా పరిశోధనలు గావించడానికి కూడా యీ సంస్థ పెక్కు పథకాలను సిద్ధం చేసింది.

* సమాజాభివృద్ధి కార్యక్రమం, 2.37 కోట్ల జనాభాతో 83, 415 చదరపుమైళ్ళ విస్తీర్ణంలో ఆవరించివున్న 24,417 గ్రామాలలో అమలుపరచ బడింది. రాష్ట్రంలో 378 అభివృద్ధి మండలాలను ఏర్పాటు చేశారు.

* నిర్బంధ ప్రాథమిక విద్యా పథకంతోపాటు, బడికివెళ్ళే పిల్లలకు మధ్యాహ్న భోజనం సరఫరా చేయడానికి సంబంధించిన రెండు పథకాలను కూడా ప్రవేశ పెట్టడం జరిగింది.

మూడవ ప్రణాళికా పథకాలన్నింటికీ అవసరమైన సాధన సంపత్తులను సమకూర్చుకోడానికి నూతన చర్యలు తీసుకుంటున్నారు. అయితే నిశ్చయంగా దీని విజయంమాత్రం, దృఢ సంకల్ప బద్ధులైన ప్రజల స్వేచ్ఛా పూర్వక సహకారం పైననే ప్రధానంగా ఆధారపడి ఉంది.

— స. పౌ. సం. శాఖ; ఆం. ప్ర.




ఆంధ్ర | సీడెడ్ | నైజాం

డిస్ట్రిబ్యూటర్స్: గౌతమి పిక్చర్స్... భాస్కర్ పిక్చర్స్ - వాణీ ఫిలిమ్స్

TRALEKHA

STUDIO



వెన్నదొంగ